# సావిత్రమ్మగారి సంధ్యారాగం

( కథల సంపుటి )

బుద్ధవరపు నాగరాజు, బి. ఏ., బి. యీ.

పబ్లిషర్సు :

సుందర రాం & సన్సు, తెనాలి.

# సావిత్రమ్మగారి సంధ్యారాగం

( కథల సంపుటి )

రచయిత :

బుద్ధవరపు నాగరాజు, బి. ఏ., బి. యిడి.

పబ్లిషర్సు :

సుందరరాం అండ్ సన్సు, తెనాలి.

# పీఠిక కాని పీఠిక

## I

ఇది చాలాకాలంనాటిసంగతి. అప్పుడే నేను కొత్తగా ఆ కాలేజీలో చేరాను. నేను కాలేజీనించి బైటకువస్తుంటే యీ వ్యక్తి లోపలకుపోతూ కళాశాల ఆవరణప్రాంగణాన ఎదురయ్యాడు. నిండుసూటు, నోట్లో యింతపాటి దొర చుట్ట, చేతిలో ఒకటో, రెండో పుస్తకాలతో చాలాతాపీగా వస్తున్న యీవ్యక్తి స్థానం ఆకళాశాలలో ఏమిటయివుంటుందో తెమలక చాలా తికమకలుపడ్డాను.

ఈ వ్యక్తికి కొంచం వెనకగావస్తున్న ఒక విద్యార్థిని నిలవేసి "ఆయన ఎవరు?" అని అడిగాను.

"నాగరాజు"

"ఏంచేస్తుంటాడు?"

"చుట్టలుకాలుస్తుంటాడు"

తరువాత ఒక వారంరోజులకే తెలిసింది అంతపెద్ద చుట్టలుకాల్చే ఆ నాగ రాజూ విద్యార్థేనని,

నాకు చిన్నప్పటినించీ అస్వాభావికమైనపనులుచేసేవాళ్ళని, అసహజమైన మనఃప్రవృత్తులుగలవాళ్ళనిచూచి ఆనందించే దురభ్యాసంవుంది. అందుకనే నాకు నాగరాజుగారంటే అభిమానం ఏర్పడిందనుకుంటాను, ఎప్పుడుచూచినా చుట్టపొగ తాపీగా వొదులుతూ, ప్రకృతిలో అంతర్భూతమై, ఎన్నో పరిశ్రమ ణలపర్యంతంగా అర్థంకానివైయున్న జీవితరహస్యాల్ని తనచుట్టపొగలో చూస్తున్నాడా యీ వ్యక్తి అన్నట్లు కనిపిస్తుండేవాడు. కాగిచల్లారినపాలు, వర్షం వెలిసిన ఆకాశం, వాటర్‌లూ మింగేసిన నెపోలియన్—యింకా ఎన్నో మరుగునపడిన విషయాలు, మాసిపోయిన మానవోత్తములు—గుర్తు కొస్తుంటారునాకు, నాగరాజుగారిని ఎప్పుడుచూచినా.

## II

మానవులకు తమజ్ఞానేంద్రియాలు పనిచెయ్యడంమొదలుపెట్టే ప్రారంభ దశనించీకూడా ఉత్తమజీవయాత్ర సాగించాలనే సత్సంకల్పమే వుంటుందను కుంటాను, కాలంచేసే పరిధిలేని యీఅనంతయాత్రలో ప్రతిమానవుడూగూడా

కొన్ని ఉత్తమభావాలతోనూ, కొన్ని సమున్నతాశయాలతోనూ జీవితాన్ని ప్రారంభించి వాటి సాధనలోనే నిర్యాణంపొందడానికి ఆకాంక్షిస్తాడు. కాని ఆదర్శాలు, అనుభూతులు వేరువేరవుతాయి. ఆదర్శాలను జీర్ణించుకొని వాటి సాధనద్వారా సంఘానికి సేవచేద్దామని కృషిచేసే ప్రతివ్యక్తీగూడా తన జీవిత సౌఖ్యానికీ, ఆనందానికీ చాలా ఎడమైపోతున్నాడు. ముఖ్యంగా ద్వేషానికి, అసూయకు, నైచ్యానికి, అవినీతికి, పిరికితనానికి, జుగుప్సకు కరువులేని మన దేశంలాంటి దేశంలో ఆదర్శాలకు సాధనచేసేవాళ్ళ వ్యక్తిగత సౌఖ్యానికీ, ఆనందానికీ అంతరాయాలు ఏర్పడడంలో వింతేమీలేదు. దాస్యబద్ధంగానూ, మలిన పూరితంగానూవుండి, అవిద్య స్వైరవిహారంచేసే సంఘానికి అసూయ విశిష్టలక్షణం, అట్లాంటిజాతి క్రమక్రమేణా తన ఆరోగ్యచిహ్నాలన్నింటిని చిదిమివేసుకొంటుంది. తత్ఫలితంగానే ఆసంఘం చాలా అనారోగ్యవంతుల్ని సృష్టించుకొంటుంది. ఈ అనారోగ్యవంతులే వైతండులు, పాషండులు, పిరికివాళ్లు, మురికివాళ్లు, జుగుప్సావంతులు, విషమహాసులు నానాశాఖలుగా మొత్తం సంఘాన్ని ఆవరించుకుంటారు. కాబట్టే యిట్లాంటిసంఘంలో సత్యం-అహింసలపేరిట జరిగేమోసాలు, తెల్లవాళ్ళున్న రైలుపెట్టెలో ఎక్కలేని భీరుత్వం, దానబుద్ధి అన్నీగూడా సౌమ్యతక్రింద, ఉదార స్వభావంక్రింద కొట్టివెయ్యబడుతుంటయి. పైగా అది అనుశ్రుతంగా వస్తున్న తమజాతి యొక్క వైశిష్ట్యత అనే దురహంకారంతో విర్రవీగడంకూడా ఆసంఘం అలవరుచుకుంటుంది. ఇక యీ వాతావరణంలోని సంఘంలో తయారయ్యే ప్రతి మేధావి, ప్రతి ప్రతిభావంతుడుగూడా "సినిక్"గా మారడానికి యిదే ప్రబల కారణమని నావిశ్వాసం.

ఇంతకూ నేను చెప్పదలుచుకుంది నాగరాజుగారు "సినిక్"అనిమాత్రమే.

## III

భారతజాతిలోవుండే ఆనారోగ్య చిహ్నాలన్ని సర్వలక్షణశోభితంగా మూర్తిమంతంకావడంలో ఆంధ్రులే ప్రథమస్థానాన్ని అందుకుంటారు. అసమర్థులు, జీవచ్ఛవమానవులు, నిర్లిప్తనిరామయనిస్సహాయులు, చవటలు అయిన ప్రతివారికిగూడా వర్తమానాన్ని, భవితవ్యాన్నిగురించికాకుండా సర్వావస్థల్లోను గడిచి, గతించిన, పౌరాతన్యమైన తమపెద్దల భూతచరిత్రనుగురించి

లొట్టలువేసుకొంటూ చెప్పకొని బ్రతకటం సహజలక్షణం. ఈ నిస్తేజమైన భావం—యిది ఆదర్శంకూడాను—యీ నాటి మనసాంఘికజీవనంలో అన్ని శాఖల్లోనూ బలవత్తరంగా ప్రతిబింబించడం చాలా శోచనీయం. కనకనే మన రాజకీయరంగంలోగానీ, సారస్వత శాఖలోగానీ, దైనందిన సమస్యల్లోగానీ, అన్నింటిలోనూగూడా యీభావాన్ని, యీఆదర్శాన్ని ప్రచారంచేసేవాళ్లు యుగపురుషులై కూర్చుంటున్నారు.

తామరకంటె ప్రమాదకరమైన కీర్తికండూతి జాడ్యంవాతబడ్డ శ్రీరామచంద్రులు, హరిశ్చంద్రుని వంటి నపుంసకులు, ధర్మరాజువంటి కుచ్చితులు నచ్చే మనసంఘానికి స్వచ్ఛంద జీవితాన్నిగడిపే మరేయితర సాధారణ మానవులు పనికిరారు.

అందుకనే మనవారికి పతివ్రతలకథలు నచ్చినంతగా ఏ కుటుంబరావు కథలూ, వెంకటచలంకథలూ నచ్చవు.

ఈకారణంవల్లే నాగరాజుగారికథలుగూడా చాలామందికి నచ్చకపోవచ్చు. కొంతమంది దృష్టిలో ''సావిత్రమ్మగారి సంధ్యారాగం'' కథవ్రాసిన నాగరాజుగారు క్షంతవ్యులు కాకపోవడంలోగూడా ఆశ్చర్యంఏమీలేదు. కాని ఎంతమందో నాగరాజులు, కుటుంబరావులు, వెంకటచలాలు అసమర్ధరచయితలనిపించుకొని ఆహుతికాందే యీసంఘాన్ని ఆచ్ఛాదితమైన మాలిన్యం వొదిలిపోదని నా విశ్వాసం.

## IV

నాగరాజుగారూ!

సర్వేచెట్టులో అహంభావాన్ని, ''అహంబ్రహ్మాస్మి'' సిద్ధాంతాన్ని చూడగలిగినమీరు, మీరచనలద్వారా విశ్వాసంగల శునకాల్ని, ఉండలకురాని చలిమిడిని, తలవొంగిన మామిడిచెట్టును గుర్తుకుతెచ్చే సీత, చంద్రమతుల్ని పూజించే యీసంఘంలో విప్లవాన్ని తీసుకురావడానికి ప్రయత్నించడం చాలా సాహసమేకాదూ! అయినా మీరచనలమీద నాకు చాలావిశ్వాసం వుంది.

మీరు ''నవకవి'' నాటకంవ్రాసి చాలా సంవత్సరాలయిందనుకుంటాను. మీకు గుర్తుందా? ఆ నాటకాన్ని ఆల్‌యిండియా రేడియో సమీక్షిస్తూ—ఆల్‌యిండియారేడియో అభిప్రాయాలివ్వడంలో యింకా యింత ఉదార

స్వభావాన్ని అలవరుచుకోని రోజులవి—ఆంధ్రదేశంలో వున్న ఏ ఐదుఆరు వుత్తమనాటకాల్లోనో యిదిఒకటి అని ప్రశంసించింది.

నేనూ రచయితనే గనక అట్లాంటివిషయాలు గుర్తుకువచ్చినప్పుడుమాత్రం మీరు, మీవంటి వుత్తమరచయితలు చెయ్యవలసింది చాలావుందని, చేసింది ఫలిస్తుందని నాకు చాలా ఆశగావుంటుంది.

ఇంతకూ మీపుస్తకానికి నన్ను పీఠిక వ్రాయమనడం చాలాసాహసం. నేను వ్రాయటానికి పూనుకోవడం అంతకంటేమరీసాహసమైనపని. దీన్ని పీఠికఅంటారో, పరిచయంఅంటారో, ముఖాముఖి అంటారో, యింకా ఏ మంటారో నాకుమాత్రం తెలీదు. ఇదే పీఠికఅయితేమాత్రం యిందులో మీ పుస్తకాన్నిగురించి ఏమీవ్రాయలేదనేనావిశ్వాసం, మిమ్మల్ని నేను అర్థం చేసుకున్నట్లుగామాత్రం యిక్కడ వ్రాశాననుకుంటున్నాను.

పాఠకుడిచేతుల్లోపడి మరోనిమిషంలో అతడుచదవబోతున్న పుస్తకాన్ని గురించి పీఠికపేరుతో కొన్ని అభిప్రాయాలు—సర్వసాధారణంగా దురభిప్రాయాలు—ఆతనిలో 'యింజక్టు' చెయ్యడం ఏమాత్రం ఆరోగ్యకరమైన విషయంకాదని నావిశ్వాసం.

మీరు వ్రాయమని ఆజ్ఞాపించారుగనక ఏదో వ్రాశాను. కాని యీపీఠిక ద్వారా నాతెలివితేటల్ని అప్రయత్నంగాగాని, ప్రయత్నపూర్వకంగాగాని ప్రదర్శించుకుంటానికి తలపెట్టివుంటేమాత్రం నేను క్షంతవ్యుణ్ణికాదు.

ఇక శెలవుతీసుకుంటాను.

భవదీయుడు,

పి. వి. సుబ్బారావు

# క్వారీలలో

అదుగో మంగోపార్క్ అన్నాను. మాదండు అంతా పైకి చూశారు. కొండమీద మా జాగ్రఫీ లెక్చరరు కొంతమందిని వెంటవేసుకుని ఏవేవో వాళ్ళకి తెలియచెపుతూ ముందర నడుస్తున్నాడు.

అతన్నిచూస్తే నా కెందుకో చీకటి ఖండాన్ని చెమటూడ్చి పరిశోధన చేసిన మంగోపార్క్ చప్పున జ్ఞాపకం వస్తాడు. సూటూ, హేటూ వేశాడు; మెళ్ళోనుంచి కుడితట్టుకి వేళ్ళాడుతోన్న బెల్టుకి తగిలించిన తోలుసంచి —అందులో కెమెరా మొదలైన పరికరాలు వుంటాయి; కుడిచేతిలో ఒక పెద్దసుత్తి; ఎడమచేతిలో రెండుమూడురకాల రాళ్లు; అతనికి నాలుగు చేతులు లేవుకాని లేకపోతే విష్ణుదొరలాగ నాలుగు చేతులతోనూ నాలుగు వస్తువులూ పట్టుకునేవాడే. అతనికి తెలియని విషయమంటూ వుండదని అను కునేవాళ్ళం మేం. ఇంగ్లండువెళ్లి ప్రత్యేకం జాగ్రఫీ చదువుకుని వచ్చాడు.

జాగ్రఫీ క్లాసంతా ఆవేళ కాతేరు క్వారీలకి ఎక్స్కర్షన్ వెళ్లేం. మేం వెళ్ళడం కొంచెం ఆలస్యమైంది. అంతా ఖాకీ యూనిఫారమ్ వేసు కొని బైసికిల్సుమీద యాత్రగా బయలుదేరాం.

పొద్దు పొడిచేప్పటికి కాతేరులో వుండాలన్నారు. నాకు బాగా జ్ఞానం వచ్చాక ఆవేళే మొదటిసారి సూర్యోదయం దర్శించడం. సూర్యుడు వుదయిస్తోంటే చూస్తే చాలా ఖులాసాగానూ, ఉత్సాహంగానూ వుం టుందంటారు. నాకుమాత్రం కాఫీ, సాంబారూ తాగి కొరాకిళ్ళీ బిగించి అన్నిమైళ్ళు, సైకిలు తొక్కినా ఇంకా సరీగ్గా మెలుకువొచ్చినట్టు లేదు. పైగా ఆ రోజంతా ఏదో వ్యర్థమై పోతోందన్నభావం ఏర్పడింది. ఏదో మరిచిపోయిన ట్టనిపిస్తోంది.

అసలు నాకు మెలుకువ సాయం సంధ్యలో వస్తుంది. అప్పుడు కాఫీ తాగాలి. నాలో చైతన్యం సాయంత్రం ఐదు గంటలు మొదలు రాత్రి ఒంటిగంట వరకూ వుంటుంది. అవే నేను తెలిసిజీవించే ఘడియలు.

సైకిళ్ళు కొండకింద పడేసి మేము పైకి యెక్కాం. మా లెక్చరరు సుత్తితో వొక నల్లనిరాయి పగులగొట్టి ఇది డెక్కన్ ట్రేప్, అంటే నల్ల సేనపు రాయి అని ఇంగ్లీషులో బోధపరుస్తున్నాడు మావాళ్ళకి. చుట్టు పట్ల చే లన్నిటిలో నల్ల రేవడిమట్టి వుండడానికి యీ నల్లరాతికొండ

లక్కడ ఎక్కువగా వుండడమే కారణమంటున్నాడు. పెద్దపెద్ద వర్షాలు కురిసినప్పుడీ రాళ్ళు కరిగి ఆ నీటితో కిందకి ప్రవహించి అక్కడ చేలలో నల్లని, మెత్తని మట్టిపొరలు ఏర్పడతాయట. అవి చాలా సారవంతమైన భూములట. నీళ్ళుపోస్తే రాళ్లు కరుగుతాయా? ఐనా మా లెక్చరర్‌కి తెలియని విషయమంటూ లేదు.

కొండకి వొకపక్క క్వారీలున్నాయి. ఒక పెద్దకొండని మధ్య విశాలమైన, లోతైన చెరువుగా తొలిచారు. మేమంతా వొక మందలాగా జాగ్రత్తగా లోపలికి దిగాము. మాకు ముందు మంగోపార్కు.

లోపల మర గడ్డపారలతోటి కూలీలు కొండగోడల్లో లోతైన రంధ్రాలు తొలుస్తున్నారు. రాత్రిళ్ళు ఈ బెజ్జాలలో తుపాకీమందు కూరి పేల్చి కొండని బద్దలు చేస్తారుట. అక్కడక్కడ బ్రహ్మాండమైన రాతిపలకల సందుల్లోంచి నీళ్లు జలలూరి సన్నని ధారలుగా కిందికి పడుతున్నాయి. ఆ నిర్మలమైన నీళ్ళు మా లెక్చరరు రుచిచూచి మమ్మల్ని రుచిచూడమన్నాడు. గోదావరి నీళ్లకంటె చాలా రుచిగా వున్నాయి.

"ఆఁ, ఆఁ, ఆఁ" అని ఆర్తనాదం చేశాడు మంగోపార్కు హఠాత్తుగా. అంతా కంగారుగా అటు చూశాం. మావాడొకడు ట్రాలీకిందపడి నలిగిపోవలిసిందే. ఈ కోలాహలంలో చూసుకోలేదు. కొండమీదనుంచి యీ నీళ్లులేని పెద్ద రాతినూతిలోకి రైలుపట్టాలు వేశారు. ఇక్కడ బద్దలుకొట్టిన పలుగురాళ్ళు ట్రాలీమీద పైకి లాగుతున్నారు యంత్రసహాయంతో. ఈ కొండలోంచి యిలాగా నిలువుగా అడుగుకి తవ్వుకుంటూపోతే కొన్నాళ్లకి అమెరికాలో కాళ్ళుపైకి బుర్రలు కిందకిపెట్టి తేలతాము కాబోలునని తోచింది నాకు. మంగోపార్కు నవ్వాడు.

కొండకి మరో పక్కనించి పెద్ద హోరుమని ధ్వని వినిపిస్తోంది. కాతేరుకి సమీపంలో సముద్రం ఎక్కడుంది చెప్మా అనుకున్నాను. అందరం కలిసి కొండయొక్క ఆవైపు వెళ్ళాము. అక్కడొక పెద్ద ధాన్యంమర లాంటిది పని చేస్తోంది. దాంట్లో క్వారీలోంచి ట్రాలీలలో పైకివచ్చిన పలుగురాళ్లు పడేస్తున్నారు. ఆ మర ఆ రాళ్ళని చిన్నచిన్న ముక్కలుగా నలగగొట్టి బయటికి విసిరేస్తోంది. కఠినమైన అంతెంతరాళ్లని కరకరనమిలే ఆ మరనిచూస్తే రాక్షసులు జ్ఞప్తికి వస్తారు. ఆకంకరరాళ్ళని కొంతమంది ఆడపడుచులు సైజువారీగా యేరి గుట్టలు వేస్తున్నారు.

ఆ అమ్మాయిలని చూసినకొద్దీ నాకు చిత్రంవేసింది. మేఘాల్లాగా ముసిరే మట్టీ, దుమ్మూ మీదపడకుండా తలకి గుడ్డలు చుట్టబెట్టుకున్నారు. కాని మొహంనిండా, వొంటినిండా నీలంరంగు మట్టి దట్టంగా పట్టుకుంది. మన వాళ్ళు ఫేస్‌పౌడరు వేస్తారు; వాసననూనెరాసి తల దీటుగా దువ్వుకుంటారు; సీతాకోకచిలకల-చీరలు కట్టుకుంటారు. కాని యీ పిల్లలకుండే శరీరసౌష్టవం, బలం వాళ్ళకెక్కడనించి వస్తాయి? నాగరికత!

మన నాగరకతకి ముఖ్యంగా అవసరమైన కంకరరోడ్లు ఈ క్వారీల లోంచి తవ్విన రాళ్ళతోటే, ఈ పిల్లలు వరసగా పేర్చిన కంకర గుట్టల తోటే, ఇలాంటి పిల్లలచేతే వేయిస్తాం.

దారిలో దొరికిన రకరకాలరాళ్ళని ఏరి పోగు చెయ్యమన్నాడు మా లెక్చరరు. సముద్రం ఒడ్డున గవ్వలూ, శంఖాలూ యేరుకున్నట్టు అందరం రంగురంగులరాళ్ళనిచూసి ఏరుతున్నాం. కాని నా కన్ను వొకటిమాత్రం ఆ పిల్లమీదే వుంది.

నేనొక్కణ్ణీ రాళ్లేరుతూ వేరే కొంచెం దూరంగా వెళ్ళేను. ఒక పెద్ద గుండ్రాయిని చుట్టి మలుపు తిరిగేప్పటికి ఎదురుగా వొకపిల్ల కనిపించింది. ఆమె తలకికట్టిన గుడ్డ తీసేసి, మొహం తుడుచుకుని పైటమీదవున్న ధూళిపోవడానికి వొకసారి దులిపింది. నా కళ్లు మిరిమిట్లయాయి.

ఆమె అందంగా, బలంగా కనిపించింది నాకు. నన్నుచూసి ఆమె సిగ్గుపడలేదు. వీళ్ళెంత దృఢంగా, ఆరోగ్యంగా వుంటారు! మా ఆవిడ కెప్పుడూ ఏదో ఒక రోగమే. నామట్టుకు నేను ఎన్నాళ్ళు డ్రిల్లుచేస్తే ఆ అమ్మాయంత బలంగా అవుతాను? ట్రెయినింగు చదివే ఆడవాళ్ళచేత బలవంతంగా డ్రిల్లు చేయించరని మనం బాధ పడక్కల్లేదు. ఆమెని చూచిన కొద్దీ నామీద నాకే జాలివేసింది.

ఆ అమ్మాయి నా వాలకం అంతాచూసి "ఏంటయ్యా, అట్టాఏరుకుంటున్నారు?" అంది.

"రంగురంగుల రాళ్ళు"

"ఎందుకు?"

ఆమెకి తెలిసేలా ఎలా చెప్పాలో నాకు తెలిసింది కాదు. నిజానికి నాకే సరిగ్గా తెలియదు.

"కావాలి" అన్నాను నిర్లక్ష్యంగా.

"నేనూ రంగురంగులరాళ్ళు ఏరి దాచుకుంటోంటాను."

"నాకు కొన్ని యివ్వగలవా, డబ్బులిస్తాను."

"డబ్బు లెందుకయ్యా, రాళ్ళకి? నేనుసంపాదించు కుంటున్నానుగా?"

"నీకు రోజుకి ఎంతిస్తారు?"

"నాలు గణాలు"

నేను రోజుకి నావికానివి కనీసం పదహారణాలు ఖర్చు చేస్తున్నాను ఈ ట్రెయినింగు చదవడం మొదలెట్టినప్పణ్ణించీ. ఈమె నాలుగణాలు సంపాదిస్తోంది. ఈపిల్లని నేను పెళ్లిచేసుకో గలిగితే? ఈ పాటకపుజాతికి నీతీ, నియమమూ వుండవంటారు; ఏడుమనువులదాకా పెళ్ళిళ్లు చేసుకో వచ్చుట. ఇలాగ చాలామంది పిల్లల్ని పెళ్లిచేసుకుంటే బాగుండునని సమస్య నా కిదివర కనేకసార్లు వచ్చింది.

"రోజుకి నాలుగణాలు నీకు చాల్తాయా" అన్నాను.

"నాలుగణాలకంటే ఎక్కువేం చేసుకుంటా మయ్యగారూ?"

"నీకు పెళ్ళయిందా?" అన్నాను వుండలేక.

"అప్పుడేనా?" ఆమె కిలకిల నవ్వింది.

మావా డొకడలే వొస్తున్నాడు. నేను జేబులోంచి వొక బేడకాసు తీసి ఆమెకిచ్చి, "అయినా, ఇవి నీదగ్గర వుంచుకో. నేను మళ్ళీ ఆదివారం వస్తాను. నాకు కొన్ని రాళ్లేరి పెట్టి వుంచు" అన్నాను.

ఇంకో యిద్దరుపడుచు లట్లా వచ్చారు. ఆమె వెళ్ళగానే మావాడు వచ్చి, "ఏమిట్రా బేరమాడుతున్నావు?" అన్నాడు. "రంగులరాళ్ళు" అని చెప్పి నేను ప్రస్తావన మార్చాను.

నేను మళ్లీవారం ఎట్లాగూ అక్కడికి రాలేననీ, వచ్చినా ఆమెని గుర్తు పట్టడం కష్టమనీ నాకు తెలుసు.

మా లెక్చరర్‌కి యీ భూమీ, దీనిమీది ప్రాణులూ అన్నీ పరమాణువులుగా అలసగా తోస్తాయి. అతనికి, మనకి వొక్కరాత్రి పూట ఆకాశంలో కనపడే చుక్కలన్నీ పెద్దపెద్ద బ్రహ్మాండాలై రెండుపూట్లాకళ్ళకి కట్టినట్టు కనబడతాయి. నాకుమాత్రం యీజీవితం. మనసంఘం, ప్రేమా ఇవిముఖ్యం' మన నాగరికత అనారోగ్యమనీ, క్వారీలలో పనిచేసే పడుచుల్నీ, వాళ్ళ జీవితాలనీ చూసి మనవాళ్ళు సిగ్గుపడాలనీ ఆవేళ నా మనో డైరీలో రాసుకున్నాను.

# సావిత్రమ్మగారి సంధ్యారాగం

సావిత్రమ్మగారు చాలా చక్కటి మనిషి, యాభైయేళ్ళుపైబడినయి, చెక్కిళ్ళు కొంచెంలోతుకు పోయినా కళ్ళలోకాంతి యింకా చల్లారలేదు. ఎదురుగా సంజచీకటిలో మెరిసే మిణుగురు పురుగుల్ని ముట్టుకుంటే కాలదని ఆమెకు చిన్నప్పటినుంచీ తెలుసును. కాని అవి ఎందుకలా మెరుస్తాయి……… ……… ……?

సావిత్రమ్మగారు సావిట్లో వున్న సోఫాలో కూర్చుని ఆవలిస్తూ ఏదో పుస్తకం తిరగేస్తోంది. సాయంకాలం చల్లగాలి, ఇంటిమొహం పట్టిన వొంటెద్దు బండి అంత వేగంగావస్తోంది; నాలుగు బారల దూరంలో కనబడే నైట్‌క్వీన్ వాసనల్ని నడ్డివిరిగేటట్టు మోస్తోంది; పైన దళసరి డోమ్‌లో వెలిగే ఎలక్ట్రిక్ దీపం చల్లని వెన్నెలలు కాస్తోంది.

సావిత్రమ్మగారికి ఏభైయైదు సంవత్సరాలు జరిగినట్టు ఆమెజాతకం పరిశీలిస్తే తెలుస్తుంది. జుట్టు ఇంకా తెల్లబడటానికి ఇష్టపడుతోన్నట్లు కనబడదు; వాసన నూనె రాసి నీటుగా బన్‌లాగ ముడివేసుకుంది. చెక్కిళ్లు కొంచం కొంచం లోతుకు పోయినా కళ్లల్లో కాంతి యింకా తగ్గలేదు. ముడతలు పడబోతోన్న పచ్చని శరీరంలో వొకఆకర్షణీయమైన తళుకు అలాగేవుంది. ఆమె విశాలమైన ఫాలభాగం మీద ఎర్రని కుంకంబొట్టు కనబడక పోవడానికి కారణం ఫేషన్ అనుకోవడం వుత్త పొరపాటు. మెడలో ఒక చంద్రహారమూ, చేతులకి రెండు జతలే బంగారపు గాజులూ ఆమె వేసుకుందంటే దానికి వొకటేకారణం: పరిశుభ్రమైన తెల్లనిచీర, రవిక ధరించింది. ఆమె అట్టే స్థూలంకాకుండా, బొత్తిగా పొడుగు గాకుండా చూడటానికెంతో నిండైనమనిషి. ఆమె వయసులో చూసిన మొగాళ్ళహృదయాల్లో తహతహ పుట్టించి వుంటుందని మనం గ్రహించ లేకపోతే సౌందర్యోపాసకులం కామన్నమాట.

సావిత్రమ్మగారు చాలామర్యాదస్తురాలు; అనగా మంచిస్థితిమంతురాలు. ఆమె చేతుల్లో పుస్తకం తెరచివున్నా చదవడం మానేసి చాలాసేపై వుంటుంది. ఎదురుగా సంజచీకటిలో మెరుస్తూ ఎగురుతూ వున్న మిణుగురు

పురుషుల్ని ముట్టుకుంటే కాలదనీ ఆమెకి చిన్నప్పటినించీ తెలుసు; కాని అవి ఎందుకలా మెరుస్తాయి అనే ధర్మసందేహం ఆమెని చిన్నప్పటినుంచీ బాధిస్తోనేవుంది. అయినా సమాధానం చెప్పకుంది. సమాధానం లేని 'ఎందుకు' అనేప్రశ్నలన్నిటికీ ఏర్పడివున్న సులువైన సమాధానం-సైజం! ప్రకృతిలో ప్రతిప్రాణికి తనస్వభావాన్ని ప్రదర్శించడం విధి. కాని, మానవులు మాత్రం తమస్వభావ సైజాలని ఎంతబాగా నిగ్రహిస్తే, గుప్తపరిస్తే అంత న్యాయం; నీతి, సంఘానికి సమ్మతం. తనకి వస్తువులన్నిటినీ పోగుచేసి దాచుకోవడం సైజం; కాని ఆ సైజాన్ని నిగ్రహించి ధారాళంగా ధర్మం చేసి దాత అనిపించుకుంది. తనకి పురుషుల్ని ప్రేమించడం, పిల్లల్ని కనడం సైజం; కాని,ఆసైజాన్ని అణిచిపెట్టి ఆచారంప్రకారం అయన్నే ప్రేమించడానికిఅలవాటుపడి ఆసంతానసాధనం కాస్తఆభాసుచేస్తే ఇతరపురుషుల మీదికి ఆసైజ ప్రేమ ప్రసరించకుండా చంపుకుని అందరిచేతాయింత పతివ్రత యింక లేదనిపించుకుంది. తనకి స్వేచ్ఛగా వుండడం సైజమైనా సంఘానికీ, మర్యాదలకీ బానిస అయి మంచి నీతిమంతురాలని మెప్పపొందింది. ఇన్ని విధాలుగా సైజాన్ని కాదని ఇంతసంఘ ప్రేమ సంపాదించినందుకు ఫలితం ఏమిటి? సైజానికీ నీతికీ బ్రహ్మాండమైన సంఘర్షణ; తీవ్రంగా మండిపోయే తీరనిఆకలి; పెద్దఅసంతృప్తి; ఆత్మవిఘాతం. ఇక్కడ సైజవిరుద్ధమయిన, పరిశుద్ధమైన, శీలాన్ని అలవరచుకుంటే ఈ బొంది బొగ్గులైన తరవాత యమధర్మరాజుగారు విధించేనరకశిక్ష తప్పుతుందిట. కనుక ఆ బాధ నివృత్తిచేసుకోవాలంటే మనంముందుగా ఈ అమూల్యమైన జీవితకాలమంతా స్వేచ్ఛను, సుఖాన్నిత్యజించి ఆనరకబాధనంతా ఇక్కడే అనుభవించవలసి వుంటుంది. నరకబాధ ఎలాగూ తప్పనప్పుడు ప్రస్తుత జీవితంలోనే సుఖానుభవం చేసి తరవాతే ఆ యాతన నెందుకు ఎందుర్కోకూడదు? సావిత్రమ్మగారు తనకి చాలాఅన్యాయం చేసుకుంది, సంఘంమాట నమ్మి. ఈ పుస్తకం తనకి కొంతకాలంక్రిందట దొరికితే ఎంతఉపయోగకరంగా వుండును? ఇప్పుడింక చేతులు కాలేయి; ఆకులు పట్టుకుంటే?-

ఒక నల్లని బొచ్చు కుక్కపిల్ల చడీచప్పుడూ లేకుండావచ్చి ఆమె కాలు నాకింది. ఆమె చటుక్కున పుస్తకం పక్కనపడేసి, ''వచ్చావా, బుచ్చీ! బువ్వతిన్నావా?'' అంటూ దాన్ని ఎత్తుకొని వోసారి ముద్దుపెట్టుకొని

వొళ్ళో కూర్చోపెట్టుకొని దువ్వుతోంది. బుచ్చి తిన్నగా పడుకోకవగరుస్తూ అప్యాయంగా ఆమెవళ్ళంతా ఎగబ్రాకుతోంది. "బుచ్చీ, నువ్వుకూడా లేకపోతే నాపని ఏంకాను?" అంది ఆమెదాన్ని సముదాయిస్తూ. బుచ్చి "అలా అనకూడదు" అన్నట్టు గురగురలాడుతూ ఆమె మెడమీద నాకి, ఇంకా చెవికోసం మూతిచాపుతోంది. "ఛీ" అని ఆమె బుచ్చిని ప్రేమతో వొక్కసారి గుంజి, కుదించి మళ్ళీ వొళ్ళో పడుకోబెట్టుకొని జోకొట్టింది.

ఆమె మళ్ళీ పుస్తకంతీసి ఆవలించింది. నెమ్మదిగా అడుగులలో అడుగులు వేసుకుంటూ వెంకన్న టీ కాబోలు పట్టుకొస్తున్నాడు. సాయంకాలం తేనీరు తాగడం వొకటే సావిత్రమ్మగారి శీలంలో లోపం. ఆ దురలవాటు చేసుకొన్నందుకు ఇప్పటికింకా తన్ను తానుక్షమించుకోలేదామె. వెంకన్న టీ బాగాచేస్తాడు. ఇదివరకు వెంకన్న నడుస్తుంటే ఇల్లంతా అదిరేది. వెంకన్న వయస్సు నిర్ణయించాలంటే వీళ్ళు తక్కువ; అతన్ని అడిగితే ప్రయోజనంవుండదు. అధమం అరవైఅయినా వుంటాయని మనం అంచనా వెయ్యొచ్చు. తను కాపరానికి వచ్చేనాటికి వెంకన్నకి నూనూగు మీసాలొచ్చాయి. పాపం, ఇతను ఎన్నాళ్ళనించి నమ్మకంగా నౌకరీ చేస్తున్నాడో! నెరసిన తలకనిపించితేఏమో, నెత్తిమీద పాగాపెట్టుకున్నాడు. నుదురు మీద గీతలు పిల్లకాలువలులాగున్నాయి. గుంటలుపడి అప్పుడే కళ్లుమలినమై పోతున్నాయికూడాను. కాని తెల్లగాపండిన కోయిజరుమీసాలు వడిదిరిగి నున్నని గడ్డానికి మరింతనునుపు తెస్తున్నాయి. ఉలవచేసిన మల్లుపంచ వస్త్రాదులాగ వెనక్కివిరిచి కట్టాడు. వెంకన్న ఆజానుబాహువే. ఇదేమిటి-ఎంత నమ్మకమైన నౌకరైతేమాత్రం వెంకన్న పూసు!త సెందు కాలోచించాలి అసలు? వెంకన్న పరపురుషుడు!

"టీ అండి అమ్మగారు" వెంకన్న వొక చిన్నబల్ల ఆమె ముందుకులాగి టీ కప్పు దానిమీద వుంచాడు.

"వెంకన్నా, బుచ్చిభోజనం అయిందా?" అందామె తలఎత్తకుండానే.

"చిత్తం" అని చేతులు కట్టుకుని నుంచున్నాడు వెంకన్న.

సావిత్రమ్మగారు మళ్ళీ ఆవలించారు: వెంకన్న చప్పున చిటికలువేసి "గజేంద్ర మోక్షమండి, అమ్మా" అని అమాయికంగా అడిగాడు.

"కాదు, ఈసారితప్పావు" అందామె చేతుల్లోవున్న పుస్తకం సంగతి

జ్ఞాపకంవచ్చి, కొంచెం వత్తిగిలుతూ.

వెంకన్నకి విద్యాగంధంలేదు; కాని పుస్తకాల అట్టలుచూసి గ్రంథం పేరు చెప్పుకోగలిగే విద్య అతనిదగ్గరవుంది.

"వెంకన్నా, ఈ పుస్తకం ఎంతమంచిదనుకున్నావు?"

"చిత్తం."

"ఇలాంటి పుస్తకాలు మాచిన్నతనంలో లేవు."

"చిత్తం"

"ఉన్నా, చదవనిచ్చేవారుకారు."

"యేదాంతం అనుకుంటానండి."

ఇన్నాళ్ళ కామెకి కొంచెం నవ్వువచ్చింది.

"అచ్చే, మనం అనుభవించే కష్టాలన్నీ మనం తెచ్చిపెట్టుకున్నవే అని రాశారు ఇందులో."

"అదేంటండమ్మగారూ, మనల్ని పరీక్షించటానికి బగమంతుడు కట్టాలు తెచ్చి పెడతాడంటారు, గజేంద్రుడి భక్తి కనుక్కోడానికనే కాదండీ యిష్ణుమూర్తి ఆయన్ని మొసలిచేత బాధపెట్టించాడు?"

"మొసలిచేత మొదట కరిపించడం ఎందుకు, మళ్ళీ రక్షించడం ఎందుకు చెప్పు; తెలివితక్కువపని కాకపోతేను? అయినా వెంకన్నా, ఏనుగులు మాట్లాడేవంటావా?" సావిత్రమ్మగారికి కొంచెం వేడెక్కింది.

"అమ్మా ఆకాలంలో—"

"ఆదంతా నమ్మకు వెంకన్నా. ఏకాలంలోనూ ఏనుగులు మాట్లాడి ఎరగవు. ఆపుస్తకాలు రాసిన పెద్దమనుష్యులు వాళ్ళబుద్ధికి తోచిన నీతులు మనకి నచ్చచెప్పడానికి రాసిన రాతలవి. ఏనుగులూ, మొసళ్ళూ, కుక్కలూ పాములూ, ఇలాంటి జంతువులకి మనుష్యులభాష మాట్లాడటంలాంటి విపరీతశక్తులని కల్పించిరాస్తే మనకి ఆశ్చర్యమూ, నమ్మకమూ కలుగుతాయి. పోనీ, నరకలోకం వుందంటావా?"

"ఉందండమ్మా; మాతాతచెప్పేడు వుందని. అతనోసారి చచ్చి మళ్ళీ బలికినప్పుడు నరకలోకం చూసొచ్చానని చెప్పాడు. అతను చెప్పినవన్నీ వున్నాయి. బెంగుళూరు చాలా అందమైన పట్టణమని చెప్పేవోడు. నేనూ బెంగుళూరు చూశాను. చాలా అందంగా వుంటుంది."

"ఎంత వెఱ్ఱివాడవు వెంకన్నా నువ్వు. అలాంటి భావాలన్నీ మనకి చిన్నప్పటినించీ, మన పెద్దలు ఎలాగ అనుకోవడం అలవాటుచేస్తే అలాగ ఆలోచించడం, అలవాటై పోతుంది. చూడు, ఉప్పఎలాగ వుంటుంది?"

"తెల్లగా, వుప్పగా వుంటుందండి."

"అవునా, మనం వొకపిల్లాడిని వేరే లోకంతో సంబంధంలేకుండా పెంచుతూ జ్ఞానం వచ్చినప్పటినుంచీ ఉప్పనల్లగా, కారంగా వుంటుందని బోధించామనుకో: పెద్దవాడయాక వాడిదగ్గరకెళ్ళి ఎవరైనాఉప్ప ఉప్పగా వుంటుందంటే వాడునవ్వి ఆ చెప్పినవాడికి మతిపోయిం దనుకుంటాడు."

కరడుకట్టిపోయిన వెంకన్న బుర్రలో ఇది ప్రవేశించడానికి వొప్పకో లేదు; నమ్మకం కుదరక, "నిజమే నంటారా?" అన్నాడు

"చూడు, మేం ధనసహాయం చెయ్యకపోతే నీకొడుకు బి. ఎల్. పాసై ప్లీడరవగలుగునంటావా? ఎదూడలనో కాస్తూవుండును; ఏమంటావు?"

"అమ్మమ్మ.బగమంతుడు మీకా అనుగ్రం పుట్టించాడు."

"కృతజ్ఞతలేనివాడిలాగ అలాగ మాట్లాడతావేం, వెంకన్నా? ఇప్పుడు నీకో పదిఎకరాల భూమి రాసిచ్చాననుకో;అప్పుడు నువ్వింతకంటె ఎక్కువ తృప్తిగానూ,సుఖంగానూ కాలక్షేపం చేస్తావు. ఈబుద్ధికూడా భగవంతుడే నాకు పుట్టిస్తున్నాడంటావా?"

"అమ్మా, నాకిప్పుడున్నది చాలునండి. తమఆదరణే పదేలు. ఏదో అగ్గానంవల్ల అన్నాను; తమకి కోపమొస్తుందనుకోలేదు."

"కోపమా? నీమీద నాకెన్నడూ కోపంరాదు, వెంకన్నా. నేను మన పెద్దలు బోధించిన నీతులువిని నాజీవితమంతా వ్యర్థం చేసుకున్నానని ఇప్పుడింకంతా మించిపోయాక విచారిస్తున్నాను. నామీద ఎవరికీ జాలిలేదు."

"ఎంతమాట సెలవిచ్చారు; తమకోసం నా వొళ్ళంతా కోసి ఇచ్చెయ్యమన్నా సిద్ధంగా వున్నాను."

"నీ వొళ్లంతా కోసియిస్తే మాత్రం నాకేమి ప్రయోజనం చెప్పు. నా వృధా అయిపోయిన, అమూల్యమైన జీవితం తిరిగి గమ్మంటే వొస్తుందా? ఇప్పుడీ బుచ్చి అయినా లేకపోతే నాపని ఏమౌను?"

"అమ్మా, అబ్బాయిగారు కూడా అలాగే చెయ్యనా? ఈ సమయంలో తమదగ్గరుండి భార్యగారితో కాపరం చేస్తూ తమకళ్ళ కానందం కలిగించా

ల్సినమాట."

"ఆ అబ్బాయి మనఅబ్బాయి ఎందుకౌతాడు, వెఱ్ఱివాడా? వాడేం కడుపున పుట్టినవాడు గనకనా? పోనీ, ఆతగాణ్ణేం బాధించాను చెప్పు. నువ్వేమీ చెయ్యక్కర్లేదు, ఇంతకలిగిన దేవోతిని, హాయిగా యింటిపట్టున వుండమన్నందుకే కాదూ నామీద కక్షకట్టి భార్యని తీసుకుని దూరదేశాల్లో కాపురం పెట్టాడు?" ఆమె కంట తడిపెట్టుకుంది.

"తమరలా విచారిస్తే నేను చూడలేను. చూడండి, నేను చిన్నప్పటినించి తమకెలా సేవచేస్తే సుకంగా వుంటాదో అలా నడుచుకుంటున్నాను. నామనసు-వెంకన్నింక మాట్లాడలేకపోయాడు.

సావిత్రమ్మగారు జవాబు చెప్పలేను. ఆమె మనస్సులో అనేకజాతుల భావాలు చెలరేగి అల్లకల్లోలంగా చేస్తున్నాయి. ఇంతలో పుస్తకంలోంచి వొకవుత్తరంజారి క్రిందపడింది. ఆమె దానిని తీసిచూసి కోపంతో, "వెంకన్నా, ఆయనకోసం మనయింటికి నారాయణరావుగారనే వొక స్నేహితుడొచ్చేవాడు. జ్ఞాపకం వుందా?"

అయ్యో, వుండం డమ్మా. చాలా మంచివారు. నాకెన్నోసార్లు వూరికే నే డబ్బుకూడాయిచ్చి ఎంతో అభిమానంగా చూసేవారు."

"ఆ అభిమానం నీమీదకాదు, వెంకన్నా; నామీద. నన్నెలాగైనా అయనకి వప్పచెపుతావనే ఆశతో నిన్నుకట్టుకోడానికి చేసినప్రయత్నమది."

"ఎంత దురన్నాయం; నేను కానలేక పోయాను."

"నిజమే. అయన వొకనాడు ధైర్యం చేసి వారుయింటిదగ్గర లేనప్పుడు వచ్చి తన అభిప్రాయం నాతో చెప్పాడు. అప్పుడు నేనేం చేశానో తెలుసా?"

"నాతో చెప్పవలసిం దమ్మగారూ; తోళ్ళువొలిపించేద్దును. ఎంత దారుణం!"

"ఏదో మంచిపని చేస్తున్నానని, పుణ్యం వస్తుందనుకొని అతన్నిసాగ తీసి చెంపమీదకొట్టాను."

"తగినశాస్తిచేశారు; కాని చాలదు"

"ఇదుగో, ఈవుత్తరం ఆయన రాసిందే. ఇదే నాకాయన రాసిన మొదటి ఉత్తరమూ, ఆఖరి ఉత్తరమూను."

"అమ్మమ్మా, ఎంత దుర్మార్గుడు. ఒకవేళ తను అందాన్ని చూసి వెర్రెత్తిపోతేమాత్రం తెగువచేసి తమతోటే చెపుతాడా?"

"నయంకాదూ; ఇలాంటివూహ లోపల పెట్టుకుని కుళ్ళకుండా పైకి కక్కేసి మనస్సుని సుఖపెట్టుకున్నాడు. నేను మట్టుకు ఆయన్ని పాపం కొట్టకుండా నాకిష్టంలేదని మర్యాదగా చెప్పివుంటే ఎంతబాగుండేది!"

"ఫరవాలేదండమ్మా. కొట్టడమే మంచిది. నెమ్మదిగా చెపితే అలాంటి స్థితిలో ఆయనకి నచ్చదు: ఇంకా ఆశపెట్టుకుని పీకుతుంది; ఇంకా వదలడు."

"అదేమిటోయ్? నామనస్సుమాత్రం ఇతరుల మీదికి పోలేదంటావా? నేను పాపం వస్తుందని బలవంతంగా అపుచేసుకున్నాను గాని. అది సహజంకాదూ?"

"అమ్మగారూ, ఇనండి, ఆయన దగాచేసినా ఆ మారాజు, బాబుగారికి భార్య అయారు. తమరలా అనుకోకూడదు"

"వెంకన్నా, నేను వ్యభిచారం చేశానంటే నమ్ముతావా?"

"అమ్మగారు, అమ్మగారు, తమరలాంటిమాట అనకూడదు;'' నేను వినకూడదు."

"ఒకనాడు సాయంత్రం జ్ఞాపకంవుందా? ఆయన తెగతాగి కారులోంచి తూలి క్రిందపడిపోతే, డ్రైవరూ నువ్వూ లోపలికి సాయంపట్టి పక్కమీద పడేశారు? ఆ వేళ నన్ను చితకకొట్టారు కూడాను, ఆయన?"

"చిత్తం; బాబుగారికి దురభ్యాసాలుండేవని వొప్పుకుంటాను"

ఆమె పుస్తకంలోంచి ఇంకో కొన్ని వుత్తరాలుతీసి, "ఇవిగో, ఆయన బెంగుళూరునుంచి డబ్బు పంపించమని ఇంటికి రాసిన వుత్తరాల్లో కొన్ని. నేనిక్కడ బెంగపెట్టుకుని కుళ్లి చస్తోంటే ఆయన అందమైన బెంగుళూరు పట్టణంలో ముండల్ని పెట్టుకుని తాగి తందనాలాడుతూ డబ్బు సరీగ్గా పంపించటంలేదని ఎప్పుడో ఇంటికొచ్చి నన్ను తన్ని వెడుతోండటమా?"

"అమ్మగారెప్పుడూ సుఖపడలేను. ఈపాపమంతా చూడమని నాకు రాసి పెట్టాడు దేముడు."

"మరి, ఆయన బ్రతికివున్నన్నాళ్ళూ మనస్సులో అసహ్యించుకుంటూ లోకం మెచ్చుకోవాలని ఆయనతోటి కాపరం చెయ్యటం వ్యభిచారం

చెయ్యటం కాదంటావా?''

''నేనింక వినలేదండమ్మగారూ'' కళ్ళనీళ్లు పెట్టుకుంటాడు.

''పోనీ, పెళ్ళి మనకి జ్ఞానంలేనప్పుడు పెద్దవాళ్లు చేశారనుకో; తరవాత నేను తీరకూచుని కొడుకునంటూ పెంచుకుని వాడిప్పుడు నామాట విన్నాడు కాదని ఏడవటం ఎవరు తెచ్చి పెట్టారంటావు? నాబ్రతు కింక ఇంతేనా? నాలోనించి పొంగుకుని వస్తోన్న ప్రేమ ఎవరిమీద చూపించను? దీన్ని లోపల అణిచిపెట్టుకోడం ఎలాగ? నేనిప్పుడేం చెయ్యను?''

''అమ్మగారూ, నన్నిలా బతకనివ్వరూ? నాభార్య నాచిన్నప్పుడే మా కుర్రవాణ్ణికని రెండేళ్ళకే చచ్చిపోయింది. అప్పటినించీ నేను మళ్లీ పెళ్ళి పూసెత్తుకోకుండా తమర్ని కళ్ళల్లో వొత్తిలాగ కొలుచుకొని బతుకు తున్నాను. ఇప్పుడు తమ రిలా ఇడవటం నేను చూడలేను.''

''వెంకన్నా, ఇంక దాచడం అనవసరం. నేను అత్తవారింటికి వచ్చిన కొద్ది కాలానికే ఆయన అంటే నాకు పట్టలేనంత అసహ్యం పుట్టుకొచ్చింది. అప్పుడు నిన్ను చూస్తోంటే, ఈ పెద్దకుటుంబంలో ఎందుకు పుట్టానో, ఇంత మంచివాడైన వెంకన్నని పెళ్లాడి వుంటే ఎంత బావుండును అని నిజంగా అనుకోని రోజంటూ లేదు.''

''అమ్మా, అమ్మా!''

''వెంకన్నా, నువ్వేదైనా నీమనస్సుకి నచ్చిన పని చెయ్యాలనుకున్నప్పు డల్లా ఏదైనా వొస్తే అది సంఘమే అనుకో.''

వెంకన్న కొంచెం జ్ఞప్తితెచ్చుకొని ఒక గుటక వేసి, ''ఏ సంగం, అమ్మగారూ?'' అన్నాడు కలలోంచి మెలుకువ వచ్చినట్టు.

''ప్రత్యేకంగా ఏ సంఘమూ కాదు. మన సంఘమే; అంటే మనమే; మనం చేసుకున్న కట్టుబాట్లు''

''ఎవ మనస్సుకి వచ్చిన పనివాళ్లు చేసేస్తోంటే లోకంలో బతకటం కష్టమై పోతుందేమో నండమ్మగారు.''

''ఎవరికి వారుకాదు. లోకంలో అందరాడాళ్ళకీ నా దౌర్భాగ్యమే పడుతుందా? అందరి మొగుళ్లూ తాగుబోతులే అవుతారా? నాలాంటి వాళ్ళని కనికరించి లోకంలో దారివిడిచిపెట్టాలి; ద్రోహులుగాచూసి వాళ్ళ జీవితం బలిచెయ్యకూడదు''

'అమ్మా, నా సంశయమంతా మబ్బులా గిడిపోయింది. గనక మనవి చేసుకుంటున్నాను. తమరేనాడీ లోగిట్లో కాలుపెట్టారో ఆ యాలనుంచీ తమ మీద అదోవిధమైన భక్తి, యిష్టమూ ఏర్పడ్డాయి. నాకు అప్పటేల నించీ తమన్నొక దేవతలాగ మనుసులో పూజించుకుంటున్నాను. కాని నా కడుపులోవుండే వూహ పైకి చెబితే వురితీయిస్తారని ఇన్నాళ్ళనుంచీ వోపిక పట్టుకొని వూరుకున్నాను. లోకానికి జడిశాను. తమ అనుగ్రహం; ఇంక చెప్పేశాను.-''

సావిత్రమ్మగారు ఉత్సాహంతో లేచి చల్లారిపోయిన తేనీళ్లు వొక్క గుక్కలో తాగేసి, వొళ్లో నిద్రపోతున్న బుచ్చిని లేవదీసి వోమారు గట్టిగా ముద్దుపెట్టుకున్నారు.

# పెళ్లిలో

"వాయించండోయ్, భజంత్రీలు" అని పురోహితుడు అరవడం ఏమిటి, అక్కడున్న బాజాలన్ని వొక్కసారిగా గప్పుమన్నాయి; ఎక్కడా వొకదాని కొకటి సంబంధంలేదు. హైందవ ఆర్చెష్ట్రా, పాపాసాహెబు వెండితొడుగు కట్టెమీదవేళ్లు వెర్రిగా నొక్కుతూ వూదేస్తూవుంటే తూతూ బాకాలు బొంయిమన్నాయి. తలపగిలిపోతోంది ఒకటే రణగోల. రంధోలు తాలుకు మూడుదెబ్బలూ మాత్రం వీటిపైన గుండెలు దద్దరిల్లేటట్టు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

అంటే పెళ్ళి ఘెళ్ళుమంటూ జరిగిపోతోందన్నమాట.

రాత్రి వొంటిగంటా యిరవై అయిదు నిమిషాలవుతుంది. సాధారణంగా వట్టి పెళ్ళి ముహూర్తాలుకూడా శోభనం ముహూర్తాలలాగ నిశరాత్రి వేళ పెడతారెందుకో? చక్కగా అందరికీ అనుకూలంగా వుండేటట్టు ఏ సాయంకాలమో ఎందుకు పెట్టుకోకూడదు? జాతకాలు వొప్పుకోవట. కనుక అనుభవించవలసిందే.

హాలులో అత్తరువుల సువాసనలకంటె పువ్వువెలగపూల గుమాయింపు

ఎక్కువగా గుబులు పుట్టిస్తోంది. పువ్వువెలగల పరిమళంఅంటే చంద్రుడికి చెప్పలేనంత ఆనందం. ఆపూరిమీదుగా వెడుతూ స్నేహితుడికీ చెల్లెలికీ పెళ్ళిఅని, వోసారిచూసి వెడదామని ఆతనారాత్రి కక్కడ దిగాడు. చంద్రుడు చాలా చిత్రమైన మనిషి.

అతని పేరు అసలు రామచంద్రుడైనా, కొంచెం సాహిత్యవాసన కల వాడవడంవల్ల అందరిచేతా చంద్రుడని పిలిపించుకుంటున్నాడు. చంద్రుడి అలవాట్లు, అభిప్రాయాలూ కూడా అందరికీ చిత్రంగానే అవుపడతాయి. అతను దారినిపోతూ, పోతూ తారసిల్లిన ఆడవాళ్ళనందర్నీ ఎగా దిగా వొక్కసారి పరీక్షగా చూస్తేనే కాని పోనివ్వడు. చూసి వాళ్ళకి మార్కులు వేస్తాడు; మార్కులు వెయ్యటం అంటే, తన మనస్సులోనే వాళ్ళ అందాన్ని కొలిచి చిన్నడిగ్రీలు వుందని నిర్ణయిస్తాడు. అతనికి వాళ్ల వయస్సుతో నిమిత్తంలేదు: చిన్నపిల్లయితే, యీమె ఎదిగి పెద్దదయితే, ఎంత అందగత్తెగా మారుతుందో గుణిస్తాడు; ముసలిఆమె అయితే, ఆమె కాలంలో ఎంతసుందరిగా వుండివుంటుందో వూహిస్తాడు. ప్రేమఅంటే అతనికి బొత్తిగా నమ్మకంలేదు. హృదయం విరహంఅంటే విరగబడి నవ్వు తాడు. ఊహవచ్చిన ఇద్దరు వ్యతిరేక లింగముల వ్యక్తులు మనఃస్ఫూర్తిగా అంగీకరించి ఏర్పరచుకొన్న సంబంధంతో మరో మూడో వ్యక్తికి జోక్యం కలుగజేసికోడానికి ఏవిధమైన అధికారమూ వుండకూడదని వాదిస్తాడు.

చంద్రుడు అప్పుడప్పుడు పుస్తకాలు రాసినా ప్రస్తుతం ఇంగ్లీషు మందు లమ్మే ఏజంటుగా వుంటున్నాడు. అతన్నిబాధించే పెద్ద సాంసారికమైన సమస్య వొకటివుంది. తను ఏడాదికి ఏనెల్లాళ్ళో ఇంటి పట్టున వుంటాడు. దేశాలన్నీ తిరిగి తిరిగి తీరా స్వగ్రామంచేరుసనేసరికి భార్య నీళ్లాడి వూరు కుంటుంది. ఇలా నాలుగేళ్లనించి గమనిస్తున్నాడు. అక్కడికీ అతనికి సంతాననిరోధక సాధనాలమీద విశ్వాసం ఏమాత్రమూ తగ్గలేదు.

రాత్రి పన్నెండు గంటల దగ్గరనించి అతను దీక్షగా గమనిస్తున్నాడు. వైవాహిక విశేషాలుకాదు. తనకి ఎదురుగా కూర్చుని రెప్పవాల్చకుండా తనకేసి చూస్తోన్న ఆమె ఎవరు? ఆమె చూపులు తనని ఎందుకలాగ బాధిస్తు న్నాయి? ఇంక వుండలేక వొంటిగంటన్నరకి సాహసించి ప్రక్కనున్న స్నేహితుణ్ణి అడిగాడు: "ఆపిచ్చెత్తించే చురుకైన సోగకన్నులు ఎవ

రవిగారూ?'' అని.

నీ అభిప్రాయలలాగే నీకళ్లు మహా చెడ్డవిరా?'' అని కొంచెం దూరంలో ఎదురుగా కూర్చున్న ఆడంగులకేసి చూశాడు స్నేహితుడు.

''ఒరే కలకల నవ్వుతూ ఏడిపించే ఆవిడ కళ్ళకంటే నంటావా?''

''ఆవిడా? ఆవిడ మా నారాయణరావుబావ భార్యరా. అతను సెలవు దొరకక మొన్న నీమె నిక్కడ దిగబెట్టి వెంటనే వెళ్లిపోయాడు. అన్నట్లు నువ్వతన్ని ఎరగవు?''

''ఆహాఁ; ఆయనకంటె ఈమెనే బాగా ఎరుగుదును.''

''అలాగా?''

''ఆయన్ని నేనెప్పుడూ చూడలేను. ఈమెని చాలా సేపటినించి చూస్తున్నాను; ఈమెనే ఫలనా అని తెలియకుండా చాలా కాలంనించీ కలలలో చూస్తున్నాను కూడాను. అది మా చిరపరిచయం.''

''ఏడిసినట్లేవుంది! అయినా యీవిడని అందమైన ఆడవాళ్ళలో లెక్క-వెయ్యవొచ్చు.''

ఓరి చచ్చా! ఇంకా సందేహమేమిటి; చూడు, కొంచెం అలా బయటికి వెళ్ళి కాస్తమంచి గాలి పీల్చుకుని వద్దాం, రా. మరి.''

''సిగరెట్టని కాబోలు నీ ఉద్దేశం. నువ్వెళ్లిరా.''

బయట పందిరిలో ఇలాయి బుడ్డి ఇంకా ఎంతసేపు మేలుకోను అన్నట్లు కునుకుతోంది. చంద్రుడు చీకట్లోకి వచ్చాడు. దీపాన్ని సిగరెట్టు ముట్టించాడు; సిగరెట్టు వెలిగింది, దీపం ఆరిపోయింది; అమరజ్యోతి. ఆమెకూడా ఇవతలికి రావాలని అతని ఆశ. లోపలికి చూశాడొకసారి. ఆమె ఇలగా దున్న గుమ్మంవైపే చూస్తోంది; కళ్ళు జ్యోతుల్లాగ వెలుగుతున్నాయి. ఆవిడ తనకేసి ఎందుకలా చూడాలి? చంద్రుడి కారాత్రి నిద్రపట్టలేదు.

మర్నాడు వుదయమంతా ఆమెను చూడాలని ప్రయత్నించాడు. మధ్యాహ్నం భోజనంచేసి చెయ్యితుడుచుకుంటూ హాలులోకి వస్తూంటే అతని కామె దర్శనం అయింది. ఒకప్రక్కగావున్న చాపమీద ఒయ్యారంగా నిద్రపోతోంది. ఆమె కన్నులు మూతబడివున్నా సొగసుగానే వున్నాయి. ముంగురులురేగి మొహంమీద ఆడుకుంటున్నాయి. పమిట ఎక్కడా సడలకపోయినా లోపల తీర్చిదిద్దినట్లున్న నిమ్నోన్నతాలని అతను ఒక్క-

నిమిషంపాటు తన 'ఎక్సరే' వంటి కళ్ళతో దొంగతనంగా చూసేసి యువత
లికి వచ్చేశాడు. ఆమె మొహం సిగ్గుతో ఎర్రబడినట్టయింది. అతను ఆలోచిం
చడం ప్రారంభించాడు; ఈమె ముసలిది అయిపోతే ఎట్లావుంటుందా అని.
పాత సౌందర్యచిహ్నాలతో కూడిన వొక జాలికలిగించే రూపం అతని కళ్ల
యెదుట తాండవించింది. చటుక్కున కళ్ళు మూసుకున్నాడు మనస్సో
మరి?

రాత్రి పెందరాళే రెండు మెతుకులు తిని స్నేహితుడితో చెప్పాడు, పద
కొండు గంటల రైలుకి వెళ్ళిపోతున్నానని. స్నేహితుడు వొకక్షణం ఆలో
చించి, "ఒరే ఒక్క ఉపకారం చేసిపెట్టాలిరా" అన్నాడు.

"ఏమిటది?"

"ఇందాక మా నారాయణరావు బావ వైరిచ్చాడు. తనురావటానికి
వీలులేదనీ, దయచేసి ఎవరిచేతనైనా తన భార్యని పంపించమనీని. అతను
ఉదయం బెజవాడ స్టేషనుకివచ్చి, ఆమెనిదింపి తీసికెడతాడు."

"ఓసి, ఇంతేనా? దానికేముంది. పరమ సంతోషంగా తీసికెడతాను."

"జాగ్రత్త సుమా."

"ఎప్పుడూ ట్రావెలింగు చేసేవాడికి రైలు ప్రయాణంలో జాగ్రత్తనువ్వు
నేర్పాలిట్రా?"

రైలు ఎక్కుతోంటే ఆమె పైటకొంగు తలుపు గడియకి తగులుకొని
కొంచెం చిరిగింది. చంద్రుడు ఆమెని జాగ్రత్తగా లోపలికి ఎక్కించి బెంచీ
మీద పక్కపరచి కూర్చోపెట్టాడు; ఆమె తలలోని పువ్వువెలగపూలు
గుప్పుమని అతని తల దిమ్మెక్కించాయి.

"నిద్రపోతారా?" అన్నాడు చంద్రుడు.

"నాకు నిద్రరావటం లేదండీ."

"నాకు పువ్వువెలగపూల సువాసన అంటే ఏంతోయిష్టం."

"నాకు తెలుసును."

చంద్రుడికి ఆశ్చర్యం వేసింది: "మీ కెవరు చెప్పారు?"

"మీరు రాసిన 'పువ్వువెలగలు' అనేపుస్తకం చదివాను."

"ఆ పుస్తకం మీకు నచ్చినందుకు నేను ధన్యుణ్ణి."

"అది నాకు నచ్చిందని ఎవరు చెప్పారు? మీకా పువ్వులంటే యిష్ట

మని తెలిసింది, అంతే.''

''నేను పుస్తకాలు రాస్తానని మీ కెలా తెలుసును?''

''మిమ్మల్ని గురించి అంతా తెలుసుకున్నాను.''

"నేను మందులు అమ్ముతానని కూడానా?''

''ఆఁ.''

''అయితే మీరా పువ్వులే తలలో ఏందుకు పెట్టుకున్నారో?''

''ఏందుకు పెట్టుకోకూడదు? నాకూ అవి అంటే చాలా యిష్టం. నేను మీ పుస్తకాలన్నీ చదివాను. అప్పటినుంచీ మిమ్మల్ని ఎలాగైనా కలుసుకుని మీతో ఆ అభిప్రాయాలన్నీ చర్చించాలని నా కోరిక.''

''ఈ సంగతి ఇన్నాళ్ళదాకా నా కెందుకు తెలియచేశారు కారు మరి?''

''మనది హిందూసంఘం కనక, నేను స్వాతంత్ర్యార్హంలేని స్త్రీనికనక.

''ఏరచయితనైనా పుస్తకాలు చదివి మెచ్చుకుని ఆయనని కలుసుకోవాలనీ, పరిచయం చేసుకోవాల కోరుకోవడం చాలా ఆశాభంగానికి కారణం అవుతుందని మీరు తెలిసికోలేదు. మీరు చిత్రించుకునే వూహలనిబట్టి ఆ రచయిత జీవితం ఎన్నడూ వుండదు. తెలుసుకోకుండా వున్నప్పటి స్వప్నాన్ని భగ్నం చేసుకోవడం వెర్రి కాదూ?''

''లోకంలో అందరికీ తలొక విధమైన వెర్రివుంటుంది. అసలు మన జీవితాలు ఆశాభంగాల అల్లికలని నా విశ్వాసం.''

''అదీ నిజమే. సంఘనియమాలు మన సుఖజీవనానికెంత అంతరాయాలో తెలియచేసేందుకు ఆ పుస్తకాలు నేను రాశానని వొప్పుకుంటారా?''

''అయితే అందులో వుండే వుద్దేశాలకి ఒక ఆచరణయోగ్యమైన ప్రణాళికను సూచించడం కూడా మీ విధి కాదా?''

''అది నా పని కాదు; సంస్కరణ సంస్థలు పూనుకుని అది చెయ్యాలి.''

''అయితే. ఇంక మనపని ఇంతేనా?''

''అని మనం నిస్పృహ చెందకూడదు.''

''మావారిని మీ కెరగరనుకుంటాను.''

''వారిని గురించి విన్నాను కొంచెం.''

''ఆయన చాలా మంచివారు.''

''ఓహో''

"నా కేమీ లోటులేకుండా జాగ్రత్తగా చూస్తారు."

"ఈ సంగతి వినటానికి నాకు చాలా ఆనందంగావుంది."

"అది ఆనందించవలసిన విషయంకాదు నా దృష్టిలో. చిన్న పిల్లలు బొమ్మలని చక్కగా అలంకరించి జాగ్రత్తగా దాచుకున్నట్టు చూస్తారు, నన్నాయన. అంతేకాని, నాకూ వొక మనస్సు వుందని, నాకూ కొన్ని స్వతంత్రమైన వూహాలుంటాయనీ ఆయనకి తెలియదనుకుంటాను."

"చాలామంది మగవాళ్లు యీ విషయం గ్రహించరు."

"కాని మంచితనం మహా చెడ్డది. ఆయన అంతమంచివారు కనుకనే నాలో వొక మానసిక దౌర్బల్యం యేర్పడి ఆయననుంచి వేరే పోకుండా నన్ను బలంగా కట్టిలాగుతోంది. అదే జీవితం పరిస్థితులతో రాజీ పడటానికి మొదలు."

"మీరు చాలా అందంగా వుంటారండీ."

"అవును, అయితే యేం, నా అందం వారికొక పెద్ద గొప్ప విషయం కాదు."

"రోజూ చూస్తోండడం, యీ వస్తువు నా స్వంతం అనే ధీమా దీనికి కారణాలు."

"నా సౌందర్యాన్ని పొగిడితే నా కానందంకాదూ ?"

"పొగడటానికి కాదు. కాని, మీ అంత అందమైనవారిని నే నిదివర కెన్నడూ చూడలేను; కలలలోతప్ప. ఈ విషయమే నిన్న మనవాడితో చెప్పాను కూడాను."

"నిజంగా ?"

"నిజం."

"ఇంక నేను నిద్రపోతాను."

"అప్పుడే-?"

"పెద్దలు చెప్పే నీతుల నేవన్నీ ధిక్కరించాలని నా కోరిక. అవి ప్రతిహింస నంతగా ప్రకోపింపచేస్తాయి. నేను నిన్నటినించి తీవ్రంగా ఆలోచిస్తున్నాను; ప్రేమ అనేది-"

"తాత్కాలికము".

"అబ్బ" అని బాధతో ఆమె కళ్లు చేతులతో మూసేసుకుంది.

"అరెర్రే. కంట్లో ఏదో పడింది; కాబోలు?"

ఆమె కన్ను నలిపింది. నలిపినకొద్దీ అది మండింది; నీళ్లు కారడం మొదలు పెట్టింది గూడాను.

"ఉండండి. అలా నలపకండి. గుడ్డతో కొంచెం వొత్తండి-ఊదమంటారా ?"

"ఊఁ" అని నిట్టూర్చిందామె.

చంద్రుడు ఆమె కంట్లో వూదాడు. ఆ యిద్దరి మొహాలూ అంత దగ్గరగా ఎందుకు రావాలి? ఒక్కసారిగా పువ్వువెలగలు భగ్గుమని గుమాయించాయి. రైలు కుదుపుకి అతను నిలబడలేకపోయాడు. అది వీరిని మోసుకుని జోరుగా పోతోంది బ్రిడ్జి మీదనించి. ఆ పెట్టెలో ఇంకెవ్వరూ లేరు.

గుణదల స్టేషన్ దాటింది బండి. ఆమె కళ్ళుమూసుకునే అతని వొడిలో ఒత్తిగిల్లింది. కళ్లయెదుట బెజవాడలో తనకోసం 'రాబోయే భర్త ప్లేట్ డబ్బామీది దొరబొమ్మలాగ, తాండవమాడుతున్నాడు. ఆమె కళ్లు తెరచింది. అవి ఎర్రగా చెమ్మగావున్నాయి. "ఈ సంఘటన మీరు పూర్తిగా మరచిపోతానని వాగ్దానం చెయ్యండి. ఇప్పుడు నా మనస్సుకి ఆ నీరసం తగ్గిపోయింది" అంది నీరసంగా. "ఎలాగ మరచిపోగలను?" అన్నాడు చంద్రుడు దగ్గుత్తికతో.

"పోనీ, నన్ను మళ్లీ చూడ్డానికి ప్రయత్నించననండి చాలు".

"మీ యిప్పటి రూపమే జ్ఞాపకముంచుకోమనా?" అతనికామె ముసలిదైతే ఎలావుంటుందో ఆరూపం చప్పున జ్ఞాపకం వచ్చింది. ఒక్కసారి వొణికాడు. బెజవాడ స్టేషను ఇంకా ఎప్పుడొస్తుందో?

ఈ సంఘటన చంద్రుడికి జీవితంలో కొబ్బరిచెట్టుకి మట్టవూడిపోతే పడే గంటులాగ, ఇప్పటికే స్పష్టంగా గోచరిస్తుంది.

# సంబంధం

రాజ్యం కళ్ళు విప్పేటప్పటికిఆమె హృదయం దడదడ కొట్టుకుని వొక్క-
సారి ఆగినట్టయింది. ఆరోజున సంభవించబోయే విషయం ఆమె మనస్సు
కంటె హృదయానికే బాగా తెలుసును. ఆమె వెంటనే అరచేతిలో శ్రీరా
ములు చుట్టుకుని, కళ్ళ కద్దుకుంది; ప్రొద్దుట మెలకువ రాగానే అట్లా
చెయ్యాలని చిన్నప్పుడు వాళ్ళ అమ్మ చెప్పింది.

కిటికీలోంచి చల్లని గాలివచ్చి, ఆమె ముఖాన్ని మృదువుగా తాకు
తోంది. కిటికీ దగ్గరగావున్న గున్నమామిడి చెట్టు మరుగుచెయ్యగా మిగిలిన
ఆకాశం నిర్మలంగా నీలంగా కనుబడుతోంది. చల్లని తియ్యనిగాలి
ముహాన్ని గిలిగింతలు పెడుతోంటే, బయట పక్షులు అవ్యక్తంగా కలకూ
జితాలు చేస్తోంటే, తన చిన్న మంచంమీద వెచ్చని దుప్పటి ముసుగులో
పొంగుతూన్న తొడలని దగ్గరగా చేర్చుకుని, చేతుల్ని తలకింద పెట్టుకుని
మెలకువ వచ్చిన పది పదిహేను నిమిషాలదాకా ఏదో ఆలోచించుకుంటూ
పడుకుంటే-చాలా హాయిగా వుంటుందని కొన్నియేళ్ళ క్రిందట ఆమె
గ్రహించింది.

ఆ వేళ తనికి దుర్దినంఅని ఆమెకి తెలుసు. అందుచేత లేవ బుద్ధిపుట్టక
ఇంకా కొంచెం ఎక్కువసేపు అట్లాగే కళ్లుమూసుకుని, కాళ్ళాడించుతూ
వ్యాకులంగా పడుకుంది.

వాళ్ళయిల్లు వొక చిన్న లంకమీద వుంది. ప్రక్కనే చెన్నంగి కొబ్బరి
చెట్లమధ్య లాకుసూపర్నెంటుగారి చిన్న బంగాళా.

రాజ్యం నెమ్మదిగా లేచి. కాలవవొడ్డుకివెళ్ళి. మంచులాగ చల్లగావున్న
నీళ్ళతో శుభ్రంగా మొహంకడుక్కుంది; చేతులు జబ్బలదాకా తోముకొని
పవిటచెంగుతో తుడుచుకొని చెదిరిన ముంగురులు సరిచేసుకుంటూ ఆలంక
కొసకి వెళ్ళింది.

పచ్చనితివాశీ పరిచినట్టుదట్టంగా మొలిచిన గడ్డిమీద ఉదయ కాంతిలో

పుష్యమాసపు మంచుబిందువులు మంచిముత్యాలలాగ మెరుస్తున్నాయి. విశాలమైన పడవలకాలవ గంగాయమునలలాగ రెండుపాయలుగా చీలి, ఆ చిన్నదీవిని కౌగలించుకొని కొంచెం దూరంలో మళ్ళీకలుసుకుని చల్లగా పారుతోంది. ప్రక్కన వైరులో గిలగిల కొట్టుకుంటోన్న నీళ్ళు చిన్న జలపాతంలాగ రొదచేస్తున్నాయి.

గడ్డిమీద నడుస్తోంటే పాదాలకి మంచుతాకి ముళ్ళుగుచ్చుకున్నట్టు నెప్పెడుతోన్నా, సరదాగా వుందామెకి.

ఆమెకి పదహారోయేడు నడుస్తోంది. పనిపాటలచేత ఏపుగా పెరిగిన వొళ్ళు; పండుతమలపాకువంటి రంగు; విశాలమైనకళ్ళు; నల్లనిపొడవాటి జుట్టు; మోటుతనంలేని కలకలలాడే మొహం.

కాలవపాయలుగా చీలే మొగదగ్గర వొకసర్వీచెట్టు అహంభావంతో ఆకాశంలోకి నిలువుగా ఎదిగివుంది. ఆమెకి ఆచెట్టంటే ఎంతో అభిమానం. ఆమె ఏమీతోచనప్పుడు అక్కడకొచ్చి కూర్చుని అదిపాడే సొదలువింటూ దూరంగా కాలవ సన్నమైపోయి ఆకాశంలో కలిసిపోయే చోటుకేసి చూస్తూ వొళ్ళు మరిచిపోతుంది.

ఆమె ఆ సంగీతం చెట్టుదగ్గర కొచ్చి "చిట్టీ! చిట్టీ!" అని పిలిచింది. వెంటనే, ఏ చెట్లమాటు నుంచో వొకచిన్న నల్లని మేకపిల్ల మెళ్లో మువ్వలు ఘల్లుఘల్లుమంటూ పరిగెత్తుకొనివచ్చి, రొప్పుకుంటూ తన ముట్టెని ఆమె చీరకుచ్చెళ్లలో ఆప్యాయంగా దాచుకుంది. ఆమె వంగి దాని వీపుమీద ముద్దు పెట్టుకుంది. ఒక్కసారిగా చిట్టిని తనలో ఇముడ్చుకోవాలని బుద్ధి పుట్టిందామెకి.

ఈ మేకపిల్ల అంటే రాజ్యానికెంతో ప్రేమ. సరీగ్గా ఏడాదిక్రిందట వొకనాటి వుదయం దానితల్లి ఆ సర్వీచెట్టుదగ్గరే చిట్టిని యీని, కాలధర్మం పొందింది. ఆ సమయానికే రాజ్యం అక్కడికి వెళ్లి, మంచుగడ్డిమీద పడగానే చిట్టి నాలుగు కాళ్లమీదా గెంతడానికి ప్రయత్నిస్తూ వాల్లీ చచ్చిపోయిన అమ్మని ముట్టెతో పొడిచి లేపుతూంటే, చూసి, జాలితో దానిని ఎత్తుకుని, అప్పణ్ణించీ ఆమె దానిని తల్లిలాగ సాకుతోంది.

ఇవాళ చిట్టిని అమ్మవారికి నైవేద్యం పెట్టడానికి నిర్ణయమయింది.

ధగధగ మెరిసే పదునైనకత్తి చిట్టి మెడమీద పడి, దానిమొండాన్ని

తలనీ వేరు చెయ్యడం, మొండెం గిల గిల కొట్టుకుంటూంటే కంఠంలోంచి రక్తం చిమ్మిన గొట్టంలోంచిలాగ చిమ్మి కాలవలు కట్టడం ఆలోచించుకునేప్పటికి రాజ్యం కళ్లు చీకట్లు కమ్మాయి; గుండె రెపరెప కొట్టుకుంది. కాని, చిట్టిప్రాణాన్ని రక్షించడాని కెవరివశమూ కాదు; రాజ్యం తండ్రి అలాగ జరగాలని శాసించాడు గనుక. వాళ్లయింట్లో అత నంటే హడలు; సింహస్వప్నం. అలాగని వాళ్ల యింట్లో ఏ జంతువుకీ మేపు తక్కువ చెయ్యడంగాని, సరిగ్గా చూడకపోవడంగాని ఎవరూ చేసి యెరగరు. కాని, ఆ జంతువులు కూడా వాట్ల ధర్మాలని సరీగ్గా నెరవేర్చి తీరాల్సిందే— ఆవులు పా లివ్వవలిసిందే, కోళ్లు గుడ్లు పెట్టాల్సిందే, పిల్లులు ఎలకల్ని చంపాల్సిందే; మేకలూ కోళ్లూ వాట్లసమయం వచ్చి నప్పుడు అమ్మవారికి నైవేద్యం కావల్సిందే.

జంతువులకి దయాదాక్షిణ్యాలు మోతాదుగా చూపించాలని ఆమెతండ్రి నమ్మకం. కాని రాజ్యం తనకి వొక్కతే కూతురనే వ్యామోహంవల్ల చిట్టి మీద ఆమెకుండే వ్యామోహాని కతనేమీ అంతరాయం కలిగించలేదు నేటివరకూ.

రాజ్యం తండ్రి పాతికేళ్ళనించి లాకుకళాసుగా వుంటున్నాడు. అతనికి యాభైయేళ్ళుపైబడి వొళ్ళు ముడతలు పడుతోన్నా సమయం వచ్చిందంటే తనొక్కడే ఎవరిసహాయం లేకుండానే సబ్ డివిజన్ ఆఫీసరుగారి బోటు గంటకి నాలుగు మైళ్ళ చొప్పున లాగెయ్యగలడు.

నిన్న పొద్దున్న తనూ వాళ్ళమ్మా చద్దన్నాలు తింటూంటే అతను వచ్చి, "చూడు నాన్నా. మనచిట్టి ఎదిగి మేకఅయింది. ఎప్పుడైనా దీన్నిమనం కోయించవలసిందే. రేపు అమ్మవారి పేరుచెప్పి కూరవండుకుంటే బాగుంటుందని నాకుతోచింది" అని చిరునవ్వుతో అన్నాడు; కాని అది సుగ్రీవాజ్ఞ. రాజ్యం హఠాత్తుగా బెంగపెట్టుకోకుండా అత నీ సంగతి వారం క్రిందట వోసారి సూచించాడు.

తండ్రిమాటకి ఎదురుచెప్పి ప్రయోజనం లేదని రాజ్యానికి బాగా తెలుసును. చిట్టికీ తనకీ యింకఋణం తీరిందనుకుని వూరుకుంది. ఆమె కెవరితోనూ అట్టే మాట్లాడటం ఇష్టంవుండదు కూడాను; తనఆలోచనలే తనవి.

కాని, యీ ప్రకటన వినగానే ఆమె తనతల్లికేసి వోసారి చూసింది.

ఆమె తల్లి సన్నగా పొడవుగా వుంటుంది. కూతురంటే ఎంతో ప్రేమ. కాని, ఆమెకూడా మితభాషిణి. ఆమెకి కావలసినవాటి కెన్నడూ లోటు లేదు; లేకపోయినా లేవని బాధపడదు. పిల్లదాని మేకపిల్లని ఎలాగారక్షించలేనని ఆమెకీ తెలుసు. అంచేత శూన్యంగా ఆమెకేసి చూసి వూరుకుంది. ఆమెకి వొక్కొక్కప్పుడు కోడి పెట్టల్ని చంపడం ఇష్టముండదు. అయినా ఎన్నోసార్లు చంపింది.

ఈవిషయంలో వాళ్ళ అమ్మకూడా ఏమీచెయ్యలేదని గ్రహించి రాజ్యం వొక్కసారి అమ్మవార్ని తల్చుకుంది. ఈఅమ్మవారేకాదూ మేకల్నీ మనుషుల్నీ చేసింది? అమ్మవారికి మేకలూ కోళ్ళూ అంటే ఎందుకో అంత ప్రీతి? పూర్వం మనుషుల్నికూడా తినేదిట! అమ్మవారు గాడిదల్నీ, కుక్కల్నీ, ఏటిగపాముల్నీ ఎందుకు తినదో? మనం ఎందుకుతినం? మేకమాంసం తింటే రుచిగానే వుంటుంది. మరి చిట్టిని చంపుతారంటే ఎందుకు నాకింత ఏడుపొస్తోంది? నేను సొంతగా పెంచాను దాన్ని. అమ్మవారు మేకల్నీ, కోళ్ళనీ, సొంతంగా పెంచదుగా. ఆమె చెమ్మగిలిన కళ్ళల్లో భీకరమైన అమ్మవారి విగ్రహం స్పష్టంగా కనబడుతోంది. అమ్మవారిలో ఏదోగొప్ప శక్తివుంటుందిట. ఏమో అదేం శక్తో? చిట్టి చిట్టిని కాపాడలేనిశక్తి.

రాజ్యం కళ్లువాల్చి చద్దన్నం తినేసింది. రాత్రంతా నిద్రపోయింది. మళ్లీ తనకి మెలకువ వచ్చేటప్పటికి దుఃఖంకూడా మేలుకుంది.

వాళ్ళ గుమ్మంచీడీల మీద నుంచుంటే లాయనూపరెంటుగారి యింట్లోకి ఎవరు వచ్చిపోయినా చక్కగా కనబడతారు. ఈసూపరెన్టెంటుగారు వచ్చి నాలుగేండ్లయింది; మంచిబ్రాహ్మణుడు.

రాజ్యం రహస్యాలు బాగా దాచగలదు. ఒకరహస్యం ఆమె పదేళ్ళనించి దాచింది. అప్పుడు తనకి ఆరోయేడు. ఒక రాత్రివేళ ఆమెకి మెలుకువొచ్చింది. తన ప్రక్కలో వాళ్ళనాన్న లేడు. మరికొంచెం కళ్లుతెరిచింది. అతను వాళ్ళఅమ్మ మంచంమీద కూర్చునివున్నాడు. అదేమిటి? వాళ్ళమ్మ కోడిపిల్లపీకి నులిమినట్టు అతనామె పీక నులుముతున్నాడు? ఆమెకి భయంవేసి కళ్ళు మూసేసుకుంది. కొంచెం సేపుండి మళ్లీచూసింది. వాళ్ళఅమ్మ వోసారి మూలిగింది. జ్వరం వచ్చినప్పుడు అమ్మతనకి కాళ్ళు పట్టినట్టు నాన్న అమ్మకి కాళ్ళుపడుతున్నాడు. అమ్మకి జ్వరం వచ్చింది కాబోలు.

ఆమెకి చాలా బెంగ వేసింది. మళ్ళీ కళ్ళుమూసుకుని అమ్మకిజ్వరం పెందరాళే నయంకావాలని అమ్మవారికి మొక్కుకుని, నిద్రపోయింది. పొద్దున్న నాన్న తన పక్కలోనే వున్నాడు. అమ్మలేచి ఏమీ జబ్బు చేయనట్టుగానే పాచి పని మామూలుగా చేసుకుంది. తను అమ్మవారికి మొక్కుకోటంచేత అమ్మకి రాత్రి అంత తీవ్రంగా వచ్చిన జ్వరం తెల్లారేటప్పటికి నయమైపోయిందన్న రహస్యం ఆమె ఎవరితోనూ చెప్పలేదు.

ఇంకో రహస్యం మూడేళ్లనించి దాస్తోంది, అది సూపరెంటుగారి అబ్బాయి, యింకెవరూ చుట్టుపట్లలేని సమయంలో తనకేసి అదేపనిగా చూసేవిధం. తను గది కిటికీదగ్గర నుంచుంటే అతను వాళ్ల కిటికీలోంచి రెప్పవాల్చకుండా, ఏదోపారేసుకున్న వస్తువుని తన కళ్లలోంచి లోపలి కంటా వెతుక్కుంటోన్నట్టు, వూరికే చూస్తాడు.

రాజ్యం అతన్ని చూడనిచ్చేది. అత నలాచూస్తే తన గుండె కొట్టుకుంటుంది. గుండె అలా కొట్టుకున్నప్పుడు తనకెంతో బాగుటుంది; తనకికూడా అతనికేసి చూడాలని వుంటుంది. ఆమె మరో ఆలోచనలేమీ లేనప్పుడు అతన్నిగురించే ఆలోచిస్తోంటుంది.

సూపరెంటుగారి అబ్బాయి పట్నంలో ఏదో చదివి చాలించుకున్నాట్ట. ఏడాదినించి ఇక్కడే వుంటున్నాడు. అతను ఓరసీలులాగ బట్టలూ అవి వేసుకోవడం, మైలుకూలీలమీద క్కకలు వేయటం, పెద్దపుస్తకాలు చదవడం, ఇవన్నీ చూస్తే రాజ్యాని కెంతోవింతగా ఉంటుంది. అతను తన్నెప్పుడైనా పలకరిస్తే తనేంచెయ్యాలి? ఆమెగుండె వేగంగా కొట్టుకుంది.

కాని రాజ్యానికి మొగాళ్లంటే భయం. వాళ్ళతోటి ఏవిధమైన సంపర్కం తనకుండకూడదని ఆమె నమ్మకం. ఆమె అప్పుడప్పుడు ఊళ్లోకి సంతికి వెళ్లి కూరలు తెస్తుంది. ఆ సంతలో జరిగే సంగతులన్నీ తెలుసుకుంటే ఆమెకి మొగాళ్ళంటే అయిష్టం మరీ యెక్కువౌతుంది. తను పెళ్లి చేసుకోవలసివస్తే? వాళ్ళనాన్న అమధ్య అమ్మతో అన్నాడుగా, అమ్మాయికి పెళ్లి చేస్తే బాగుటుందని.

పెళ్ళిచేసుకుంటే అత్తారింటికి వెళ్ళిపోవాలి. అమ్మా, నాన్నా తనతో వుండరు. తను ఎవరో ఎరగని కొత్తవాళ్ళయింట్లో వుండాలి. తన గదీ తన చిన్న మంచమూ వదలిపెట్టాలి. ఇక్కడిలాకూ, సైరు రోజా, పడవలూ,

సరిపీచెట్టూ, అవీవుండవు. ఒకనాడు తను ఏమీతోచక టెలిఫోను చెవిదగ్గర పెట్టుకుంది; చెవిలో ఏవరో రహస్యం చెపుతోన్నట్టుంది. సూపరెంటు గారి అబ్బాయి తనకి చెవిలో రహస్యం చెబితే; అత్తారింటికి వెడితే తనకే సలా చక్కగా చూసేవాళ్ళెవరు? పెళ్లాడితే సూపరెంటుగారి అబ్బాయినే పెళ్లాడాలి. అన్నట్లు బ్రాహ్మలబ్బాయి తన్ని పెళ్ళి చేసుకుంటాడా? మరి తనకేసి అలాచూస్తాడెందుకు? ఒకనాడు అమ్మ సూపరెంటు గారి భార్యతో అంటోంది: "మాపిల్లకెక్కడా సంబంధం దొరకలేదింకా. మీఅబ్బాయి కిచ్చి పెళ్ళి చేసేద్దామండీ" అని. అప్పుడు తన మొహం ఎఱ్ఱగా అయి పోయి, వొళ్ళంతా చెమట్లుపోసి, యింకక్కడ నిలబడలేక పోయింది. మళ్ళీ సాయంత్రం అతను తనకేసి చూసేటప్పటికి తన కెక్కడలేని సిగ్గో వచ్చి, సర్వీచెట్టు డగ్గఱకి పారిపోయి, చిట్టిని కౌగలించుకుని ముద్దెట్టుకుంది.

అప్పణ్ణించీ అతని కాట్టే కనబడేదికాదు. అత నేమనుకుంటున్నాడో? కనబడినప్పు డింకా అలాగే చూస్తున్నాడే!

ఒకనా డతను చిట్టిని లాలిస్తోంటే, తను చూసింది. తను చిట్టిని దగ్గఱగా తీసుకున్నప్పుడు తనవొళ్ళో చిట్టికి బదులుగా ఆ అబ్బాయి వున్నట్టు అనిపిస్తుందామె మనస్సుకి; అతనితో ఏవో పిచ్చి పిచ్చి కబుర్లు చెబుతోన్నట్టూ, తనవేళ్ళతో అతనిజుట్టు సరిచేస్తోన్నట్టూ అనిపిస్తుంది.

అతనికి చిట్టి అంటే ప్రేమే; లేకపోతే దాన్నెందుకు ముద్దెట్టుకున్నాడావేళ?

చిట్టి అంటే తన కెంతయిష్టమో అతనితో చెప్పగలిగితే, ఎంత బాగుండును. తను చెప్పకుండానే అతను గ్రహించుకుంటే? చదువుకున్న వాడు.

చిట్టికి రాజ్యం గొంతుక బాగా ఆనవాలు. ఒకళ్ళతో వొకళ్లు మాట్లాడుకోలేకపోయినా-ఇంతనమ్మకం, ఇంత అప్యాయం ఆ అమ్మాయికీ ఆ జంతువుకీ కుదరడం ఆశ్చర్యమే!

రాజ్యం సర్వీచెట్టుక్రింద కూర్చుని ఆలోచిస్తోంది. ప్రక్కన చిట్టి గరిక పోచలు కరకర మేస్తోంది. ఆమె కేంపనీ చెయ్యడానికి తోచడంలేదు. ఆవుకి పాలు పితకాలి. ఒకసారి లేగదూడ ముందుకాళ్లు రెండూ ఆవు మీదవేసి దాని తరుము కెడుతుంటే వాళ్లమ్మ సెత్తుకో మంటోందిగామోసు అనుకున్నందు కిప్పుడామెకి నవ్వువచ్చింది.

ఎదురుగా కాలవ నెమ్మదిగా పరుగెడుతోంది. కాలవలో పడవలో ప్రయాణంచేస్తే-సరదాగా వుంటుంది. చిన్నప్పుడో సారి తను పడవలో వాళ్ల పినతల్లిగారి వూరువెళ్లింది. పిన్ని కప్పుడు పాప పుట్టింది. తనకి సందేహం వచ్చి, వాళ్ల పిన్నినడిగింది-పిల్లలెలా పుడతారని. "ఛా, అలాంటివి అడగకూడ" దని కోప్పడింది పిన్ని. మేక యీనుతోంటే చూస్తే పుణ్యాం వస్తుందిట. తను చిట్టి పుడుతోంటే చూసింది; తనకి చాలా పుణ్యం వచ్చి వుంటుంది. తనకికూడా పిల్లలు పుడితే? ఛా! జబ్బుచేస్తుంది; పిన్నికి పాప పుట్టినపు డెంత జబ్బుచేసింది. పిల్లలు పుడితే చచ్చిపోతారు కూడాను; చిట్టితల్లి చచ్చిపోలా?

రాజ్యం దృష్టి తృప్తిగా మేస్తోన్న చిట్టిమీద పడింది. చిట్టికి గరికగడ్డి తియ్యదనం, •రాజ్యం గొంతుకలో తీపీ తప్ప వేరొకటి తెలియదు. అది ప్రేమా, అపాయమూ అనేవి ఎరగదు. రాజ్యం హృదయంలో తన నిమిత్తం తుపానులా రేగుతోన్న భయంకరమైన భీభత్సంతో దానికి నిమిత్తంలేదు.

చిట్టి నీడ చూచేసరికి రాజ్యాని కెంత పొద్దుపోయిందో తెలిసింది. పొద్దెక్కి- పోతోంది. ఆమె హృదయం తహతహలాడుతోంది, చిట్టికేసి చూసినకొద్దీ.

చద్దన్నాల వేళయింది. వాళ్లనాన్న వస్తాడు. చిట్టిని గుడికి తీసికెళ్ళే వేళవుతోంది.

"నేనుకూడా చిట్టితో వెడతాను. నాతోకూడావుంటే దానికేమీ అనుమానం వెయ్యను" అనుకుం దామె.

రాజ్యం ఇంటికెళ్ళింది. నేనుకూడావస్తాను చిట్టితోటి గుడికి, అంది వాళ్ళనాన్నతో. అంతదూరం తనుకూడా లేకుండా వాళ్ళనాన్న తీసికెడితే చిట్టికి బెంగగావుంటుంది. అందులోనూ దాని ఆఖరురోజుని చిట్టికి బెంగ కలిగించడం న్యాయమైన పనికాదు. వాళ్ళనాన్న ఆమెచిన్న బుచ్చుకోకుండా "సరే, సాయంత్రం నువ్వుకూడా వొద్దుగాని" అన్నాడు. అసలు చిట్టిని బలిద్దామంటే రాజ్యం యేడ్చి అల్లరి చేస్తుందను కున్నా డతను.

రాజ్యాని కింట్లో వాళ్ళమ్మకి సాయం చెయ్యవలసిన పనులు చాలా వున్నాయి. కాని, యివాళ కామె నెవరూ ఏమీ అన దల్చుకోలేదు.

రాజ్యం "చిట్టీ! చిట్టీ!" అని పిల్చింది. కాలవ వొడ్డున కాసుకుని

కూచున్న చిట్టి మెడలో మువ్వ ఘల్లుమంటోంటే వొక్క గంతులో కుక్క పిల్లలాగ వచ్చి ఆమెదగ్గర వాలింది.

తను గబగబ నడుస్తోంటే చిట్టి తనచిట్టి కాళ్ళతో ప్రక్కన గంతులు వేసుకుంటూ పరిగెత్తడం రాజ్యానికెంతోయిష్టం. ప్రక్కన అమాయిక మైన చిట్టిలేకుండా తనొక్కత్తె ఇంటికి నడిచి వచ్చేప్పుడెలా వుంటుందో ఆమె ఆలోచించడానికి ప్రయత్నించింది. వాళ్ళయింట్లో బంధువులెవరూ చచ్చిపోవడం ఆమె యెరుగదు. బ్రతికి వుండగా పుణ్యంచేసుకుంటే చచ్చి పోయాక అంతా హాయిగానూ, ఆనందంగానూ వుంటుందంటారు. కాని, ఆ ఆనందమూ, హాయీ ఎలా వుంటాయో మాత్రం ఎవరూ చెప్పలేరు. చిట్టి ఏమీ పాపాలు చెయ్యలేదు.

ఆమె కెవరైనా చచ్చిపోయినట్టు కలలైనా రావు. ఆమెకి కలలువస్తే, సూపర్నెంటుగారి అబ్బాయి నవ్వుతూ తన నోట్లో సిగరెట్టు పెట్టినట్టూ, ఆ అలవాటులేని పనికి తను వుక్కిరి బిక్కిరైనట్టూ— సర్వీచెట్టు చివర కనబడకుండా ఆకాశంలోకి సూటిగా ఎదిగిపోయినట్టూ, ఆ ఆకాశంమీద తనుపడుకుని కిందచెట్టు మొదట్లోకిచూసి నవ్వుతోన్నట్టూ-వస్తాయి. మెల కువ రాగానే ఎంతోహాయిగానూ, ఆనందంగానూ వుంటుం దామెకి. ఒక్కొక్కప్పుడు, తనుచేత్తో మూతి తుడుచుకునే సరికి పళ్ళన్నీవూడి పోయి చేతిలోకి వచ్చేసినట్టూ, రహస్యంగా సూపరెంటుగారి అబ్బాయి గదిలోకి వెళ్ళేసరికి అతని బల్లమీద అన్నీ మొనలు విరిగిపోయిన పెన్సిళ్ళే వున్నట్టు కలలొస్తాయి. అప్పుడు మెలకువరాగానే మాత్రం ఆమె కెంతో నీరసంగా, తల నొప్పిగా వుంటుంది.

నీరసంగా, బరువైన హృదయంతో రాజ్యం చిట్టిని వెంటవేసుకొని పూరివైపున నడుస్తోంది. ఇంకా ఎండకాస్తోన్నా అప్పుడే చలి మొద లెట్టింది. చెట్లమీదనించి పండిన ఆకులు వుండుండి రాలుతున్నాయి. చిట్టి మేకపిల్ల కాకుండా పండుటాకైతే యెంత బాగుండును.

చిట్టికి రాజ్యం మనస్సులో పరిగెత్తే భావాలూ, ఆమెని వేధిస్తోన్న భయమూ, దిగులూ ఏమీ తెలియవు. రాజ్యంతో వున్నంతసేపూ తనకేమీ అపాయం వుండదని దాని విశ్వాసం. అక్కడక్కడ ఆగి, కాస్తగడ్డి కొరు కుతూ ఆమెకూడా మువ్వలాగ తేలికగా గంతులేస్తూ వెంబడించింది.

దాని మెళ్ళో మువ్వలు ఘల్లుఘల్లుమని మోగుతున్నాయి.

వాళ్ళనాన్న కొంచెం ముందుగా వెళ్ళేడు. లాకు దగ్గరనించి వూళ్ళోకి మైలుదూరంవుంది; ఒక పుంతలోపడి వెళ్ళాలి. ఊరి చివరవొక చెరువు. ఆ చెరువు గట్టుమీద వుంది, చల్లనితల్లి అమ్మవారి గుడి.

దారిలో వారొక పంటకాలువ దాటవలసి వచ్చింది. చిట్టి కాలవదాటడానికి సందేహించింది. రాజ్యం చిట్టిని బుజ్జగించి ఏత్తుకుని దాటించింది. చిట్టి యిప్పుడెంత బరువుగావుంది! అది పుట్టినప్పుడు దాన్ని తను సందిట్లో ఇరికించుకుని యింటికి తీసికెళ్ళినప్పుడెంత తేలికగా అల్పంగా వుండేది. తరువాత దాని చిట్టికళ్లు మెరిసి, పొట్టిశోక ఆడించేయీడు వచ్చేదాకా దానిచేతి వెచ్చని పాలలో ముంచిన గడ్డిపీలికలు కుడిపించ డానికెంత ఓరిమి కావలిసి వచ్చేది!

సాయంత్రం పడుతోంది, శీతాకాలం వచ్చింది. చిట్టికి వసంతర్తువులో ఎంతో హాయిగా వుంటుంది. తనకీ అంతే. క్రిందటి వసంతర్తువు వచ్చేటప్పటికి చిట్టికి బాగా సత్తువ చేరుకుంది. వసంతంలో అదిచాలా చురుకుగా వుంటుంది. దాని శరీరంలో ప్రతి అవయవమూ మెరవులాగ గంతులేస్తూంటుంది; దానిపిచ్చి కళ్ళూ, బుల్లిగిట్టలూ, చిన్న బొద్దుగా పెరుగుతోన్న తోకా, మళ్లీ వసంతం వచ్చేటప్పటికి? ఆమెగుండె వొకసారి కొట్టుకోడం మరిచిపోయింది.

రాజ్యం తిరిగి చూసేటప్పటికి చిట్టి కనపడలేదు. ఆమెకి విపరీతమైన భయం వేసింది.

"చిట్టీ! చిట్టీ!" ఆమె బిగ్గరగా అరచింది.

నాలుగువైపులా పరికించింది. పుంతకి రెండువైపులా తోటలూ, మిగలపండి నడ్డివంగిన వరిచేలూ, ఆచోటంతా తన హృదయంలాగ శూన్యంగా కనిపించిదామెకి. ఇంతలో ఏచెట్లచాటునుంచో చిట్టి మువ్వలు మోగుతూ వొక్క గంతులోవచ్చి తన కొమ్ములొస్తోన్న తలతో ఆమెని మెల్లిగా పొడిచింది. రాజ్యానికి మళ్లీ వెలుగు కనిపించింది.

పోట్లు నేర్చుకున్నాక రాజ్యంతల్లి చిట్టిని దగ్గరకి తియ్యడం కొంచెం తగ్గించింది. కాని, రాజ్యానికి చిట్టిచేత పొడిపించుకోడం తప్పదు. రేపట్నించి తన్నింక అలాపొడిచే వారెవరు? ఆమె హృదయం కుంగిపోయింది.

చిట్టివీపుమీద మృదువుగా దువ్వింది. ఆమె కొక్కసారిచలీ, కడుపూ వేసుకొచ్చాయి. తను చిట్టిని బ్రతికించుకోలేదు; ఆ చల్లనితల్లి అమ్మవారే బ్రతికించలేదు.

నీడలు తూర్పువైపు పొడవుగా పాకుతున్నాయి. ఎఱ్ఱని యెండ చల్లగా వుంది. గాలిగడ్డ కదుతోంది. ఎదురుగా పంచాయితీవారి మరుగుదొడ్డి గోడ గోచరమయింది.

ఆగ్రామాని కదొక ప్రత్యేకత; ఏదిక్కునించి పురప్రవేశం చేద్దామన్నా ముందుగా పంచాయితీ మరుగుదొడ్డి స్వాగతం యిస్తుంది. అది దాటితే, వూళ్ళో ప్రవేశించామన్నమాటే.

ఊరికి పశ్చిమంగా కొబ్బరితోపులో నూకాలమ్మ ఆలయం. దానికి ఉత్తరపు సరిహద్దు మళ్ళీ మరుగుదొడ్డి మాన్యం. తోపులో కనుచీకటి పడుతోంది. గుడిమీద వెల్లవేసిన రుషులు తపస్సు చేస్తున్నారు. లోపల కిరసనాయిలు బుడ్డి కునుకుతోంది.

గుడి ముందర వాళ్ళనాన్న వేపరొట్ట పట్టుకుని ఎదురు చూస్తున్నాడు.

చిట్టిని మోటుగా చెవులు పట్టుకుని మెళ్ళో వేపరొట్టకట్టి, మువ్వల తాడు తెంపిపారేశాడు, దాన్ని చంపడానికి వచ్చిన అబ్బి. చిట్టి బెదిరి ''మే''అని అర్చింది. రాజ్యంగుండె తరుక్కుపోయింది. ఆమె మువ్వలతాడు జాగ్రత్తగా తీసి వొళ్లో పెట్టుకుని చిట్టిని ఆఖరుసారిముద్దుపెట్టుకుంది.

వాడు చిట్టి మొహానికి పసుపూ, బొట్టూ పెట్టి, ఆమె నక్కడనించి వెళ్లి పొమ్మన్నాడు. ఆమె వాళ్లినాన్న చెప్పినా వినదికాదు.

అబ్బి అమ్మవారికేసి వోసారి కళ్ళెఱ్ఱచేసిచూసి, ఏదోగొణిగి, అదురుపాటుగా ఉన్నప్పుడు చిట్టి మెడమీద కత్తితో వొక్కవేటు వేశాడు.

చిట్టి మెడమీద దబ్బుమన్న చప్పుడు రాజ్యంవింది. చిట్టి పక్కకి ఒక కుప్పలాగ పడిపోవటం, దానికాళ్ళు కాసేపు గిలగిల తన్నుకుని నిశ్చలమై ఆగడం ఆమె ఆవేగంతో చూసింది.

రాజ్యం కళ్ళు చీకట్లుకమ్మాయి. ఆమెకి కెవ్వుమని వొక భయంకరమైన ఆర్తనాదం వినపడింది. ఇం కక్కడ నిలబడలేక పోయింది. వాళ్ళనాన్న ఆగమని కేకలేస్తూన్నా, ఆమె వొక్క పరుగున వూళ్లోపడి, పుంతలోంచి పరిగెత్తింది. కాని, ఎంతపరిగెత్తినా ఆ కెవ్వుమున్నకేక ఆమెని విడిచి

పెట్టలేదు: అది ఆమె గొంతుకలోంచే బయులుదేరుతోంది. మెళ్లో మువ్వలు గల్లుగల్లుమని మోగుతున్నాయి. ఆమెకి బాగా ఆయాసం వచ్చాక కూడా ఆకేక ఆమె హృదయాన్ని చీల్చుకుని పైకిపొంగుతోంది. తనకి తెలియకుండానే తిన్నగావచ్చి, ఆమె కాలవ మొగలోవున్న సంగీతం చెట్టుకింద కూలిపోయింది. ఆ స్థలంలోని నిశ్శబ్దమూ, లోపలనించి పుట్టుకొస్తూన్నచలీ, ఆయాసమూ, కుసుపూ ఆమెకి కొంచెంపూరట కలిగించాయి. తల మోకాళ్లమీద పెట్టుకుని కొంచెంసేపు వెక్కి వెక్కి యేడ్చి, అప్రయత్నంగా ఆమె యెదురుగా కాలవగట్టుమీదికి చూసింది. ఇప్పుడు సూపరెంటుగారి అబ్బాయి తన దగ్గరకొచ్చి వీపుమీదరాస్తే. ఆదేమిటి? నెత్తిమీద పెట్టీ, పరుపూ పెట్టుకుని వొకమైలుకూలీ ముందు నడుస్తున్నాడు. వెనకాలే సూపరెంటుగారి అబ్బాయి.. తెల్లని బట్టలు సంజచీకటిలో స్పష్టంగా మెరుస్తున్నాయి. అతని నడక తన కౌనవాలే. అతనుకూడా వూరికి వెళ్లిపోతున్నాడు కాబోలు. చిట్టి చచ్చిపోయిందని అతనికి కేక వేసి చెబితే. వాళ్లు వూరికేసె వెళ్లే పుంతలో మాయమైపోయారు.

చిట్టి చచ్చిపోయింది. ఆమెకి? అతను నీళ్లల్లో మునిగిపోతోన్నట్టు వూపిరి సలపలేదు; కణతలమీద సమ్మెటలతో కొడుతోన్నట్టుంది.

రాజ్యం చటాలున లేచింది; మెళ్లో మువ్వలుజారి ఘల్లుమన్నాయి. ఆమె తిన్నగా తనగదిలోకి వెళ్ళి తలుపేసుకుని, తనచిన్న మంచంమీద గడ్డకడుతోన్న తొడలను దగ్గరగా చేర్చుకుని, చేతులు తలకింద పెట్టుకొని, వెచ్చని దుప్పటీ ముసుగుపెట్టుకుని పడుకుంది.

తన కిప్పుడు కొంచెం హాయిగావుందని ఆమె గ్రహించుకుంది.

# శానెటోరియమ్‌లో

"ఒరే, ఇవాళ నేనొక ఎమీలియాని చూశానురా."

"..............."

"ఒరేయ్ చిరంజీవీ!"

"ఊఁ..." చిరంజీవి బద్ధకంతో కళ్ళు నులుముకుంటూ ఆవులించాడు.

"ఒరేయ్, నిన్నే: ఇంకా మెలుకువ రాలేదూ?

"వొస్తోంది-ఏమిట్రా, అలా దీర్ఘంగా లేపుతావు?"

"లేకపోతే పట్టపగలు మూడుజాముల వేళ అనిద్ర ఏమిట్రా?"

"నేను రట్టరాత్రివేళ నిద్రపోనురా మరి—"

"రట్టరాత్రి ఏమిటి?"

"అంటే పట్టపగలుకి వ్యతిరేకం, పగలు నరజాతి యావత్తూ మెలుకువగావుండి ఏవో కోలాహలం చేస్తూవుంటారు. అప్పుడు నామనస్సంతా చెదిరిపోయి ఏపని చెయ్యడానికీ తోచదు. రాత్రి లింగోద్భవ కాలం అయే సరికి అందరూ నిద్రపోతారు. ఇల్లంతా శ్మశానంలాగ ప్రశాంతంగా వుంటుంది. అప్పుడే నేనేదైనా రాసుకున్నా, ఆలోచించినాను."

"నిశాచరుడివి పగలు నిద్రపోతే ఆయుఃక్షీణం అంటారు తెలుసా?

"అంటారు. ఎంత?"

"ఏంతేమిటి?"

"ఆయుఃక్షీణం ఎంతని?"

"పగలు ఒకగంట నిద్దరోతే మొత్తం ఆయుర్దాయంలో ఒకగంట చొప్పున తగ్గొచ్చు"

"గంటకి అయిదు గంటల చొప్పునైతే బావుండను. మనం బ్రతికిచేసే నిరవాకానికి మన ఆయుర్దాయం చాలా ఎక్కువ. అదీకాక పగలు పడుకుంటే ఆయుఃక్షీణం గృహస్థులకి; మనలాంటి బ్రహ్మచారులకి కాదు."

"అదేమిట్రా? జీవితంలో తటస్థించే ఒక్కొక్క అద్భుత సంఘటన కొన్నియేళ్ళ జీవితాన్ని పొడిగిస్తుంది తెలుసా?

"ఆయితే పగలు నిద్రపోయినా ఇబ్బందిలేదు. అసలు నువ్వొచ్చిన మహా కార్యం ఏమిటో సెలవివ్వడానికి వీలౌతుందా?"

"ఛా. నీదగ్గర కెంత ఉత్సాహంతో వస్తానో అంత నిరుత్సాహమూ చేసిపంపుతావురా."

"అసలు నిన్ను చూస్తేనే నాకు నిరుత్సాహం వొస్తుంది. ఏవో అవాఙ్మానస విషయాలు మాట్లాడతావని."

"అందుకే నిద్రపోయే కుక్కల్ని లేపకూడదన్నారు."

"నీ అభిప్రాయం ఏమిటి?"

"నే నీవాళ వొక ఎమిలియాని చూశాను."

"ఒక ఎవర్ని?"
"ఎమీలియాని."
"చూశావూ! క్రైస్తవుల పిల్ల అను కుంటాను?"
"పోరా, నువ్వెప్పుడూ ఇంతేను."
"మరి మనవాళ్ళ కలాంటి పేర్లుంటాయుట్రా?"
"ఎమీలియా వివియానీ— తెలిసిందా?"
"అయితే కాదంటావేం? క్రైస్తవులే."
"అదేమో నాకు తెలియదురా."
"ఒరే, నీకెన్నిసార్లు చెప్పాను?"
"ఏమిటి?"
"నీకు తెలియని విషయాల్ని గురించి మాట్లాడొద్దని."
"ఆవిడ పేరది కాదురా."
"ఊఁ"
"నువ్వు షెల్లీ ఏపిసైకీడియన్, చదివావా?"
"ఓహో, ఈసారి తెలిసింది." చిరంజీవి లేచి కూర్చున్నాడు."
"ఏం తెలిసింది?"
"నిన్నేదైనా శానిటోరియమ్‌కి పంపించ వలసిన సమయం వచ్చిందని."
"నేను శానిటోరియమ్‌కి వెళ్ళే వచ్చాను పొద్దున్న."
ఇంకేం!"
"ఇంకేంకాదు, నువ్వామెని చూడలేదు."
"నేను చూశానని చెప్పలేదే."
"అబ్బ! నన్ను చెప్పనివ్వవూ?"
"తరువాత?"
"మనవాళ్ళు ఉదయాన్నే బయలుదేరదామన్నారు.—"
"ఉదయాన్ని లేవడమంటే నీకు గిట్టదుగా; అసూర్యోదయపశ్యుడివి!"
"అందుకనే పెందరాళే భోజనంచేసి పదిగంటలకి బయలుదేరాం."
"ఎక్కడికి?"
"కాతేరు శానిటోరియమ్ చూడ్డానికి."
"ఓహో, ఇంకేం, అక్కడ ఎమీలియా వివియానీని దర్శించావు; ఇంక

ఎపిసైకీడియన్ లాంటి పద్యం రాయాలి, అంతేనా?"

"వినరా, మరి."

"చెప్పమరి, నిద్ర ఎలాగా పాడయిందిగా."

"అక్కడ కొండమీద వొక పెద్ద హాలులో సుమారు పాతిక మంచాల మీద రోగులు పడుకుని వున్నారు."

"ఆసుపత్రిలో రోగులు మంచాలమీద పండుకుని వుండకుండా మరి? సూర్యుడిచుట్టూ భూమి తిరుగుతోందని నువ్వు చెప్పేదేమిటి?"

"వీళ్ళందరూ ట్యూబర్ క్యులోసిస్తో తీసుకుంటున్నవాళ్ళే"

"ఏమిట్రా చంటివాడికి చెప్పినట్టు చెపుతున్నావు?"

"కొంతమంది దగ్గలేక వుండచుట్టుకు పోతున్నారు. కొంతమంది తెగ వాగుతూన్నారు; కొంతమంది వూరికే విసుక్కుంటున్నారు; కొంతమంది శూన్యంగా పైకప్పుకేసి చూస్తున్నారు—.'

"ఈ నరకలోక వర్ణనం—"

"ముఖ్యంగా భయంకరమైన విషయం ఏమిటంటే, ఆ మంచాలమీది బాధపడుతూన్న ప్రతివాడికీ తను రేపో, మాపో, చచ్చిపోతూన్నానని తెలుసు—" అతనికళ్ళు జోతుల్లా మెరిశాయి.

"యుద్ధంలోకి వెళ్ళే సిపాయిలకీ అంతే."

సిపాయిలకీ వాళ్ళకీ తేడావుంది. సిపాయిది బ్రతకడానికి కొంత కాకపోతే కొంతైనా అవకాశం వుంటుంది; ట్యూబర్ క్యులోసిస్ వచ్చినవాడికింక ఆ ఆశలేదు, చచ్చి తీరవలిసిందే. వీళ్ళకంటె కుష్టురోగులు నయం: బాధపడినా ఎక్కువకాలం జీవిస్తారు."

"ఏం ప్రయోజనంలే. అంతకంటె పెందరాళే పోతేనే మంచిది."

"కుష్ఠురోగుల్ని చూస్తే అసహ్యం వేస్తుంది; కాని ఈ క్షయరోగుల్ని చూస్తే జాలివేస్తుంది."

"వాళ్ళని చూసినా, వీళ్ళని చూసినా మనకి వేసేదిభయం; జాలికాదు అసహ్యమూ కాదు; అలాంటిస్థితి మనకెప్పుడైనా తటస్థిస్తుందేమో అని భయం. అందుకే వాళ్ళకి ధర్మంచేస్తాం. ధర్మం అనే లంచం ఇచ్చి అలాంటి అవస్థ రాకుండా తప్పించుకోడానికి చూస్తాం."

"అది కాదురా, ఎలాంటి వాళ్ళకైనా అలాంటి రోగుల్ని చూస్తే గుండె

కరిగి పోతుంది.''

''గుండె కరిగిపోతే అమాంతంగా చచ్చిపోతాం. గుండే, వూపిరి తిత్తులూ కరిగిపోవడం, క్షయరోగులకి. అందుకే వాళ్లు తొందరగా చచ్చి పోతారు.''

''రష్యా జర్మనీయుద్ధంలో రోజుకి యాభైవేలమంది సైనికులు చచ్చి పోతున్నారంటే, అదేమిటో మనకి అవగాహనము కాదు; అయోమయంగా వుండి వూరుకుంటుంది. కాని ఒక్కసారి పాతికమంది చచ్చిపోడానికి సిద్ధంగావున్న రోగులు పడే యాతన చూస్తే, ఆఖరికి వీధేపోయే ఒక్క శవాన్ని చూస్తే అక్కడ, బాంబులచేత చిత్రవధ చెయ్యబడ్డ ప్రతియోధుడూ ఎంతెంత బాధపడి బలవంతంగా మరణిస్తాడో కొంచెం అర్థమౌతుంది.''

''మనం ప్రత్యక్షంగా యుద్ధభూమిలోకి వెళ్లిచూస్తేనేగాని ఇప్పుడూ అరమాదురా.''

''అబ్బ, ఆరోగుల మొహాలుచూస్తే, వాళ్లు అనుక్షణమూ మృత్యుదేవత నించి విడిపించుకోడానికి ఎలా ఘోరంగా ద్వంద్వయుద్ధం చేస్తుంటారో బోధపడుతుంది. ఎప్పుడైతే ఆపెద్దహాలులో నేను అడుగుపెట్టానో అప్పుడే నేను భీభత్సనృత్యంచేస్తోన్న మృత్యుదేవతని ముఖాముఖి చూశాను—''

''ఎమీలియాని కాదూ?''

''ఆ హాలులో చివర మంచందగ్గర—''

''వివియానీ!''

''ఒకామె రోగికి పళ్లరసం త్రాగిస్తోంది.''

''నేను చెప్పానుగా—అదే నీ పరమ ఆదేశానికీ, ప్రస్తుతపు ప్రవక్తల ధోరణికీ కారణం; రోగులు అనుభవించే బాధకాదు.''

''అతను, ఒక గుటకవేసి, ఇంతలోకీ ఏమొచ్చిందో తుప్పుమని ఆ రసం ఆమె మీద వుమ్మేసి ఒక్క అరుపు అరిచాడు.''

''ఆమె నర్సుకాబోలు?''

''కాదు ధర్మపత్ని—ధర్మమనే గట్టి చాంతాడుతో ఆ అంటువ్యాధికి అంటగట్టబడిన అబల''

''ఒరే చంపక నువ్వు ఆవిణ్ణి ప్రేమించావేమిటి చెబుదూ?''

ఆమె కన్నులలో ఏదో అర్థంకాని వేదనలు తాండవించి పోతుంటాయి.

ఆకాశంలోని నీలిరంగు లక్కడ కాపరం చేస్తుంటాయి. ఆ కన్నులలో చీకట్లు కమ్ముకొంటాయి—''

''నీ కళ్లలోకూడా కమ్ముకొన్నాయి. ఆమె నిజంగా అందమైనదేమో కాని నీవర్ణన చూస్తే ఒక మొహంలో రెండు పెద్దలోతైన రంధ్రాలున్నట్లు కనపడేలాగ చేశావు. మనం ఏస్త్రీని ప్రేమిస్తే ఆస్త్రీకే ఈ లక్షణాలన్నీ పడతాయిరా.''

''ఆమె మెరుపు తీగరా. నువ్వామెని చూడలేదు.''

''అఖ్ఖర్లేదురా. ఈ నీలిరంగులతోటీ, ఈ చీకట్లతోటీ మొత్తానికి నువ్వు శాస్త్రీగారి తోవలో పడ్డావు; నీఆశ ఇంక వొదులుకోవలసిందే.''

''ఆమెని చూసేసరికి ఇంత సుకుమారి, ఇంత అమాయకురాలు ఆ స్వల్ప కాలంలో కాబోయే శవాన్ని ఎందుకు శాశ్వతంగా పెళ్ళి చేసుకుందా అని నా మనస్సు పరిపరివిధాల వ్యాకులత పడుతోంది.''

''పాపం!—వ్యాకుల పడవలసింది ఆవిడ మనస్సు. పైగా అది ఆవిడ చూచుకోవలసిన విషయం. మనస్సూ కోతివంటిది.''

''మనసంఘం చాలా దయా దాక్షిణ్యాలు లేనిది.''

''మనందరికీ దయా దాక్షిణ్యాలు లేవుగనకే మనసంఘానికీ లేవు.''

''దానికేం గాని మనకి విడాకులు ఇప్పుడు వెంటనే అవసరమంటావా, కావంటావా చెప్పు?''

''అంటే వెళ్లిపోతావన్నమాట — మనకెందుకురా విడాకులు, బ్రహ్మచార్యులకి?''

''నువ్వు చన్నీళ్ల వంటివాడివిరా.''

''ఆరోగ్యం—వేడినీళ్ళకి.''

''పొరపాటు. ఒరే, చిరంజీవీ, లెంపలు వేసుకుంటున్నాను; నా బుద్ధి మళ్లీ గడ్డితిని నీదగ్గర కొచ్చాను. క్షమించు.''

''ఒరే నువ్వు వట్టి పుస్తకపురుగువిరా పుస్తకాలు తెగ చదివినావు. కొన్నాళ్లు నీ పుస్తకపరిజ్ఞానం మరచిపోతేనేగానీ పుస్తకాల్లాగ మాటాడడం మానవు. ఈఎపిసైకీడియన్లూ, ఈ ఎఫీథెలామియన్లూ మనరోజు వారీ జీవితానికి భరించవు. అంచేత—'

''పొరపాటు వచ్చిందన్నాను. కాదూ, ఇంకెప్పుడూ రాను సెలవు.''

"అంచేత ఆడదాన్ని చూసినప్పుడల్లా కంగారుపడి పోకూడదు. నీ కరిగి పోయిన హృదయం కొంచెం గడ్డకట్టిన తరువాత, వేడెక్కి పోయినా మనస్సు కొంచెం చల్లబడ్డాక సాయంత్రం వోసారి కనబడు. వేరే పని కొచ్చీ విషయాలు మాట్లాడుకుందాం."

"ఇంకానా!"

"సాయంత్రం రద్దూ—అప్పుడే వెళ్ళిపోయావా? నిక్షేపంలాంటినిద్ర నిష్కారణంగా పాడుచేసావు."

చిరంజీవి చిరునవ్వుతో చుట్టుముట్టించాడు.

# చల్ మోహనరంగ

వీరేసు కడుపు వీపు కంటుకుపోయింది. కడుపులో కాళ్ళు, బుర్రలో భోజనం పెట్టుకుని ఆవులిస్తూ పేవ్ మెంటుమీద వొరిగాడు. కట్టుకున్న చిరుగులపంచ చెంగులాక్కుని కప్పుకోడానికికూడా వోపిక లేదతనికి. యుద్ధభయంతో క్షీణించిపోయిన వీధి దీపాల క్రీనీడలు వీరేసు మెదడులో వికృతలాస్యం చేస్తున్నాయి. కళ్లమంటలకి కణతల్లోంచి పొగలు పుట్టు కొస్తున్నాయి. వెనక జన్మంలో వీరేసు అతిథులకి అన్నంపెట్టి వుండడు.

పూర్వజన్మ సుకృతంతో పుట్టిన పోలీసు వొక డాగల్లీలో గస్తీకి వచ్చి వీరేసు వీపుమీద లాటితో పొడిచి లేపాడు; అక్కడ పడుకోకూడదని అద లించాడు. వీరేసు వినిపించుకునే స్థితిలో లేడు. పోలీసు విసుక్కుంటూ పువ్వుల బజారువైపుకు వెళ్ళిపోయాడు.

వీరేసు మూలుగుతూ వొకపక్కకి వొత్తిగిలాడు. మెతుకులులేని పుల్లి విస్తరాకొకటి మెత్తగా అతని మోచేతికి తగిలింది. వీరేసునోరు సెలయే రయింది. కొంచెం ఆలోచించడానికి ప్రయత్నించాడు. కెరడుకట్టిన చీకటిలా మెరిసే కారునల్లని తారురోడ్డుమీద అడుగడుగు కొక అన్నం రాసి మసకగా కనబడుతోంది,మూసుకున్న అతని కళ్ళకి. నెత్తిమీద ఎవరో కర్రలుచ్చుకొని గబగబ మొత్తుతున్నారు. యములాళ్ళకి ఎర్రటోపీ లుం టాయా అనుకున్నాడు; తలగిర్రుమని తిరిగింది. వీరేసు పోయేది నిద్రకాదు, నిప్పులు.

కురిసేమంచు చల్లదనానికి కొంచెం తాపం చల్లారింది వీరేసు దేహానికి. శిరోభారం శాంతించినా కడుపులాగే మనస్సుకూడా ఖాళీఅయింది. ఏ కచేరీలోనో రెండు గంటలు కొట్టారు. (అక్కడ కోళ్ళని కోసినప్పుడేగాని కుయ్యవు.) కాస్తంత తెల్లవారిందంటే ఆకలి ఉట్టే అనిపించదు.

ఇంతలోనూ అతనికి దగ్గరగా ఏదో దబ్బుమని చప్పుడైంది. అంత నిస్త్రాణా ఏమయిపోయిందో, వీరేసు వొక్క వుదటున లేచి గోడదగ్గరకి పరుగెత్తాడు; చీకట్లో గోడపక్కన ఏదో లీలగా కదులుతోంటే గట్టిగా పట్టుకున్నాడు. ఒక్కటే గాజున్న చెయ్యి అతని గుప్పెట్లో వూరికే గింజుకుంది. వీరేసు పట్టువిడిచి పెట్టలేదు; గాజువిరిగి వీరేసు వేలు గాయమైంది.

"నీయాటలు నాకాడ సాగవు" అన్నాడు.

"ఆడోళ్ళనలా బలవంతం సెయ్యటాని కోడవురా నువ్వు" అని కేక వెయ్యబోయిం దా మనిషి.

వీరేసు ఆమెనోరు నొక్కాడు.

"ఈపాలి సొప్పు, ఓరునువ్వు?"

"నాను రావాల్ని."

"గోడెందు కురికావు?"

"ఇంకెప్పుడూ సెయ్యను."

"ఏందీ?"

"ఆ దొడ్లో గుర్రపుసాలుంది."

"నీకిప్పుడీ యద్దరేత్రికాడ సవారీ సెయ్యాలని మణుసుట్టిందిగామాలు! ఆగోడమీదేందికి?"

"ఉలవగుగ్గిలు. నిన్నటేలినించీ గంజి తాగలేదు. ఈకాడ గుర్రాల కులమలుడకేత్తారని తెలుసు. రచ్చించాలె. ఇంకెప్పుడు నేరం సెయ్యను."

వీరేసు ఆమనిషి చెయ్యొదిలిపెట్టాడు.

"నేను కూడూదిని మూన్నాళ్ళవుద్ది. కుండ దింపు"

రావాలు బరువుదింపుకున్నట్టొక నిశ్వాసం విడిచింది.

"ఓరి బగమంతుడ! కాపలావోడు కామాలని అదలి సచ్చిపోనాను. సేతులో కర్రలేదేం సొప్పమా అని అరగా పత్తాయించాను. ఇగ రండి పోదాం."

"ఎక్కడికి?"

"మావోళ్లున్నాకాడికి."

"ఎంతదూరముంటుంది? నాకాళ్లు తేలిపోతుంటాయి. కడుపులో మంటలకి సావులు రెండూ గల్లడిపోయినాయి. అడుగుతీసి అడుగెట్టనేని స్థితిలో వుండాను-"

కుండలో వులవగుగ్గిళ్లున్నాయని విన్నప్పటినించీ మరీ ముంచుకొచ్చింది వీరేసుకి ఆకలి; కళ్లుతిరిగి క్రింద చతికలబడ్డాడు. రావాలుకి జాలి పుట్టుకొచ్చింది. చటుక్కున నెత్తిమీది కుండ దింపి.

"పాపం, ముందీ సారెడు గుగ్గిలూ బొంసెయ్యయ్యా; గంజి ఆరగా దావతు చ్చుకుందూగాని. ఆ మాశెకూతంత జివ తేరుకున్నాక పోదాం." అంటూ చారెడు గుగ్గిళ్ళుతీసి వొళ్ళు తెలియని వీరేసు దోసిట్లో పోసిందామె. ఇంతలోనూ ఆమె మనస్సెక్కడ మారిపోతుందో అని భయపడినట్లు వీరేసు ఆ దోసెడు గుగ్గిళ్ళూ వొక్కసారిగా దోర్చేశాడు; ఇంత ఉలవగంజి త్రాగి త్రేవుమనీ తేన్చి. "అమ్మయ్య!" అన్నాడు.

"ఇప్పుడు కూంత సత్తువచ్చిందా?"

తాపీగా చేత్తో మీసాలూ; మాసిన గడ్డమూ తుడుచుకుని వీరేసు లేచి, "ఇగ బయంలేదు. ఈ జానిపద" అన్నాడు.

"ఇక్కడే, పదిబారలన్నక్క. నాసెయ్యోట్టుకోండి. సిటికిలో యెల్లిపొతాం." అని రావాలు కుండ నెత్తికెత్తుకుని ముందు నెమ్మదిగా దారి తీసింది. వీరేసు ఆమె చెయ్యి పట్టుకొని పదడుగులు వేసి తరువాత తనంతట తనే మెల్లిగా రావాలు పక్కన నడుస్తున్నాడు.

కార్పొరేషన్ దీపాలు కొండెక్కాయి. గుడ్డివెన్నెల చీకటితో గొడవ పడుతోంది. ఇంతలో కారొకటి వాళ్ళ పక్కనించి ఊసలాగ దూసుకుపోయింది. ఆవెల్తురులో రావాలు జాగ్రతగా వొంగి రోడ్డుమీదిదేదో పైకితీసింది.

"ఏందది?" అన్నాడు వీరేసు.

"సుట్టపీకి."

"నాకు సొగమివ్వు."

రావాలు చుట్టపీకి తుంపి వీరేసుకి సగంయిచ్చి తను సగం నములింది.

వీరేసు అది పంటికింద పెట్టుకుని పక్కకి వుమ్మేస్తూ బాగుందనుకున్నాడు.

"అనుట్టం" అంది రావాలు.

"ఏంది?"

"నా నాడగ్గిరికి రావటం. పాపం. సచ్చిపోవాల్సిందే గందా."

"ఎర్రిదానా, తిండిలేక సచ్చిపోతామా? నాగోసినవోడు నీ రొయ్యడూ?" అని వేదాంతం వెళ్ళబోసాడు వీరేసు కాస్త కడుపునిండటం మూలాన.

"ఏందో, మాకన్నయ్యని కాపాడలేక పోయినాడు, దుక్కమాల్న దైవం." రావాలు గొంతుకలో కన్నీళ్ళు గలగల్లాడాయి.

"కన్నయ్య ఒవరు?"

"నా కొడుకు" అంది ఒకచేత్తో కళ్ళొత్తుకొని.

"ఏం, పాపం, సచ్చిపోయుండా?"

"ఆసుపటాల్లో పోయుండు, బాబు. ఆ డైవోరు, అణ్ణి యెములో తెల్తుకెల్ల, కల్లు మూసుకుపోయి కారు పిల్లోడిమీదెక్కించేసినోడు." కారు కింద పడిపోయి కొట్టుకుంటోన్న నాలుగేళ్ళ కుర్రాడు కళ్ళకి కట్టినట్టు జ్ఞాపకానికొచ్చి రావాలు వొకసారి రావాకులాగ వొణికింది.

"మీ మొగోడేంసేత్తాడు?"

"నాను మొగోడు నేడు."

"పాపం, అతగా డరగా సచ్చిపోయుండు గామాలు?"

"అసలే నేడు."

"అదేంది, కొడుకుండీ వోడన్నావు?"

రావాలులో దాక్కున్న కొంటెతనం వొక్కసారి పైకి రావాలని గోల పెట్టింది.

"ఇప్పుడైతే మాత్తరం నేదన్నానా? నాకో మొగోడంటూ నేడన్నాను. ఒక్క మొగోణ్ణెట్టుకుండి వూరేగటానికి బాగ్యమంతుల్లా మన్నాంటి ముట్టోళ్ళకెలాగడుస్తది?"

"ఆడోళ్ళు మొగుణ్ణి కట్టుకోటానికి బాగ్యం వూసెందుకు?"

"మీబార్య బాగా వుండుద్దా?"

"నాకో బారియా నేదు, బిడ్డలూ నేరు."

“శానామంది బారియాలున్నారు గామోలు.”

“అసలోవత్తినీ పెల్లాడనేగునాను; దిక్కుమాల్న పచ్చినిపోసించనేక”

“అదు గందుకనే నావోంటిదాని కొక్క మొగుడ్ణెట్టుకుంటే గడవదంట. కడుపునిండా బువ్వొచ్చీ పచ్చమైతే వోక మొగుడంటూ వుంటే సరిపోద్ది. ఆపూట గెంజికి గతి నేని ఆడదానికి వోక మొగుడుతోటే కాపరం సేత్తే, ఆడు తెచ్చీ దాడి కల్లునీల్లకే సాలదుగందా. శానామంది మొగోళ్ళుంటే కూంత కాకపోతే మా నేకూంతైనా దానికి ముట్టుద్ది.”

“ఆనే, ఆడోళ్ళ కొవళ్ళకైనా వొకడే మొగుడుండా లంటాను.”

“మల్లీ కూడెట్టనేవు. బాగ్యమంతుల సావాసవోస నేదో కలిసింది నీకు”

“కల్లు నీల్లు తాగి తగలెయ్యని మంచోళ్ళమాటో?”

“ఒవోత్తెసైనా కట్టుకోవాలని బెమ పీకుతుండాదేంది. దిక్కుమాల్న పచ్చికి కూంతి జివ సేరుకున్నాక?”

“నానా? నావూసు కాదెళ.. ఊసాడాను.”

రావాఁలు కాపరం రోడ్డుపక్క ఇరుకైన పేవ్ మెంటు మీద ఒక చెట్టు క్రింద. ఏపనిచేసినా సూర్యుడో, చంద్రుడో, నక్షత్రాలో సాక్ష్యం. దక్షిణంగా కార్పొరేషన్ డ్రెయినేజి ఒడుదుడుకు లేకుండా శాంతంగా జీవనదిలాగ పారుతోంది. దాని కవతల ఇనప కటకటాలు సరిహద్దుగా చావురుమంటూ పచ్చికతో నిండిన ఆటస్థలము. తల్లక్రిందులు పక్షులు చెట్టు మీదనించి ఉండుండి రెట్టలు వేస్తున్నాయి. అప్పుడప్పుడు పైశాచిక భాషలో కూస్తున్నాయి. చెట్టు సందుల్లోంచి వెన్నెల మచ్చలు జల్లెడలో నీళ్ళలాగ కింద చిందులు తొక్కుతున్నాయి, వెన్నెలలో వోక పందుల మంద విహరిస్తోంది.

రావాఁలు జాగ్రత్తగా కుండ కిందకిదింపి “అయ్యా, అయ్యా!’ ’అని పిలిచింది. నిప్పుల్లో వేసినా తగలడని గుడ్డముసుగులో ఒకపదార్థం కొంచెం బద్ధకంగా కదిలింది. “యాఁయిరాఁ. అయ్యా! కునుకేసి నెగు.” అని లేపింది రావాఁలు. ‘ఊఁ’ అని దీర్ఘంగా మూలిగాడు అయ్య.

“మా యయ్యకి కుట్టురోగం” అని నవ్వింది రావాఁలు. వీరేసుకి తన విద్యంతా ప్రదర్శించి ఆతన్ని బిత్తర పోగట్టాలనే ఇచ్ఛ ఆమె నావేశించింది.

"పాపం, కుట్టోణ్ణి సూసలా నవ్వగల్దుమా ? ఆ ముసలోడు మీ బాబనుకుంటా ?"

"ముసలోడని ఒకరు సెప్పారు ? ఆడికి నేను, నా కొడుకూను ఈపరపంచికంలో" అంటూ రావాలు అయ్యా ముసుగు తొలిగించింది. 'అబ్బ, సకే' అని ముడుచుకున్నాడు అయ్యా.

"గుగ్గి లెత్తుకొచ్చా, సూడు బోంసేద్దాం, లెగు, కూకోమరి" అని రావాలు అయ్యావొంటిమీది కట్లన్నీ ఒక్కటొక్కటే విప్పింది. బూడిదా, నూనీ పులిమినగుడ్డకట్టుల్లోంచి మొండిగా కనిపించిన చేతులకీ, కాళ్ళకీ వసంతంలో చెట్లు చిగిర్చినట్టు వేళ్లు మొలుచుకొచ్చాయి. పుళ్ళుంగాగ కనబడ్డానికి మోకాళ్ళమీదా, మోచేతులమీదా పట్టించిన ములగబంక గోకేస్తే అక్కడ శుభ్రమైన చర్మం వెన్నెల్లో మిలమిల్లాడింది. వీరేసుకిదంతా మొదట్లో కాస్తఆశ్చర్యంగా తోచినా ఈ ప్రక్రియ పాతగానే కనబడింది.

"ఆరోరు ? మళ్లీ ఒగ్నో తీసితెచ్చుకున్నావు?" అన్నాడు అయ్యా, కొంచెం సందేహంతో కళ్ళు నులుముకుంటూ.

"ఓరూ నేరు. నా నెల్లినకాడ ఆకలితో పడుంటే కూన్నన్ని గుగ్గిలెట్టి తీసుకొచ్చా. కూకోండి మరి."

రావాలు చేతులు మాసిన కోకచెంగుకి తుడుచుకుని, కుండలోంచి దేవితీసి గుగ్గిళ్ళు వాళ్ళిద్దరి దోసిళ్ళలోనూ పోసింది. తనో యిన్ని దోసిట్లోకి తీసుకుని బొక్కడ మారంభించింది. వాళ్ళిద్దరూ అవి అయిపోతాయేమో అన్నట్లు మెల్లి మెల్లిగా వినియోగం చేస్తున్నారు.

అయ్యాకి యేభైయేళ్ళున్నా, పాతికేళ్ళున్న వీరేసుకిమల్లే దవడలింకా లోపతికి దించుకుపోలేదు. కుష్ఠురోగం అభినయించడంలో కొంచెం గూనువచ్చినా మనిషి ఆజానుబాహువు. పండుగడ్డంతో సరైన బట్టలు వేస్తే, పొట్టమాడుతోన్నా ఘాదుపాలావుంటాడు. వీరేసు అతనిముందు పిగిలిపిట్ట. రావాలింకా మంచివయసులోవుంది; నల్లరాతి పోతలాగ నిగనిగలాడే విగ్రహం.

గుగ్గిళ్లు ఆఖరుచేసి అంతా గంజి దాహంపుచ్చుకున్నారు. రావాలు పాతగుడ్డల మూటలోంచి పైకితీసిన తాంబూలం సేవిస్తూ తాపీగా

కూర్చున్నారు. అయ్య అడిగాడు వీరేసుని:

"నువ్వేం సేత్తుంటావయ్యా, కూలిపనా ?"

"అడుక్కు తింటాను" అన్నాడు వీరేసు.

"అడిక్కైతే, మావరణమే వన్నమాట మీదీ? ఐతేని, కూంత బొక్క తవ్వటం, గోడ లురకటం శాతొచ్చా ?"

"మా సారివీసుగా సేసేవాణ్ణి. అమటకా అరెట్టుసేసి కైదులో యేశారు. అయిదు సమ్మత్సరాలు. మరిగంటే అప్పడూరికే పట్టువడి పోలేదు లెండి, కొంచం విద్దంఅరగా సేశాను. అందుకని మూన్నాల్లవింది యిడుదలవి."

"ఈ మూన్నాల్లూ కూడులేదన్నమాట ?"

"మరేనంటయ్యా, పాపము." అంది రావాలు.

"అంటూరా, ఓ పనొచ్చిందినెండి. అడంగుని నన్ను రేలెక్కిచ్చారు. ఏదో వూరుకావటాని నాను నింపాదిమీద ఎక్కుతా, దిగుతా పట్టనం సేరేతలికి మొన్న సందికాడవింది. రేల్లో నొల్లుకున్న బేడ్డబ్బులూయెట్టి అయీ, ఇయీ కొనుక్కుతిని కూన్నన్ని కాఫీనీల్లుచ్చుకున్నాను. అంతే మల్లీ ఆరం పుట్టలేదు; ఎప్పుడో గోడ్డువోర పడిపోనాను. ఎరక నేదు."

"కైదులో సౌక్కెంగానే వుంటది."

"సొప్పొద్దూ. ఇంకెప్పడూ దాంట్లోనే వుండిపోదా రనిపించింది, నామానా న్నాకు. మనదేంగి, యెదవబతుకు."

"మరి పట్టనం ఎందుకొచ్చావు ? ఇక్కడ జపానోడు బాంబులో యేవో యేత్తాడ, సచ్చిపోత మనందరూ బయటపడతూంటే ?"

"శిచ్చయింపోగానే ఇంకక్కడో చనమైనా వుండనీరు."

"పొద్దుకూకులూ నేరం సెయ్యాలన్నా యిసయం అన్నమాట."

"కైదులో నా కొకాయిన కొపడ్డాడు. ఆయానన్నాడు గందా, పట్నంలో బాంబులు పడతాయని గవర్న మెంటోళ్లు ఊరంతా గోతులు తీయిత్తున్నారు: అక్కడేమన్నా కూలిసేసుకు బతకొచ్చని."

"గోతులు దేనికిఅయ్యా ? జీవణాలుండాగానే పాతెట్టుకుంటూరా ? ఒవళ్ళకాళ్లే ?" అంది రావాలు అమాయకంగా.

"అదికాదెసి. బాంబులు పడితే పేలి సచ్చిపోకుండా మనుసులాగోతుల్లో

బాంగోవాలి.''

''మనకెందుకురా ఆ గోతులు? మనకి మన మురగ్గాలవే వుండాది. మన మందులోనే పుట్టాం; అందులోనే బతుకుదాం; అందులోనే సేసత్తాం.' అంది రావాలు.

''నా కుంకో వుపాయం అరగా తోసింది'' అన్నాడు వీరేసు.

''ఏంటది?''

''బాంబులు పడి పేలితే పెద్ద పెద్ద మేడలన్నీ కూలిపోతాయంట. పజలు మళ్లీ పెద్ద పెద్ద మేడలు కట్టుకుంటారు గాని మానరు గందా? అప్పుడేనా మనకి కూలి దొరక్క పోద్దా అని ఆశపుట్టింది నాకు.''

''ఏమోనయ్యా, మన్ని కూలికెట్టుకుంటారా? మునుపెట్టుకున్నారా? కూలిపని దొరకడానికెంత పెట్టిపుట్టాలి. నాకు నమ్మకం సాల్దు.''

గుర్రంలాగున్నావు, పోయి కూలిసేసుకోరాదా అంటారు ముట్టికెత్తేను. మనమేం సెయ్య మన్నామా? పనిసాప్పి పబువేడీ?'' అని నేరంవేసింది. రావాలు.

ఆ క్రైములో మారాజు మనివిసేశాడు: మనమిలా రోడ్డువోర పండుండే వోళ్ళమంతా కట్టుగా కలిసి పనిసెత్తే బొద్దని.''

''ఈ ముట్టోళ్లంతా కలిసిరారు. ఏదో మనం కుట్టో, కుంటో, గుడ్డో తెచ్చుకుండి యిలా అడుక్కు తినాల్సిందే. ఇదీ కూంత నయమేలే: ఓనాడు మాడినా కట్టం తక్కువ పని.''

అయ్య మాటలోంచి ఆర్పి దాచుకున్న చుట్టొకటి తీసి అగ్గిపుల్ల వెలిగించాడు. ఆ వెలుగులో వీరేసు కళ్ళు, విరుగుడుచేవతో చెక్కిన విగ్రహంలాగ మెరిసిన, రవిక లేని రావాలు వొంటిమీదపడి పైకీ కిందికీ పాకాయి. వీరేసుకి వొంటిమీద తేళ్ళు పాకినట్లయింది; రావాలుతో కట్టేసుకుని వుండిపోవాలనిపించిందతనికి యావజ్జీవమూను. ఎందుకో తాంబూల రాగంముతో నిండిన రావాలు పళ్ళ రత్నాల్లా మెరిశాయి: వీరేసుకి వేపకాయంత వెఱ్ఱిపుట్టింది.

''నాకీ జాని మీతో వుండిపోవాలని మణుసేత్తుండాది'' అన్నాడు వీరేసు.

అయ్య కీలాంటివి అవలీలగా అవగాహన మాతాయి.

“నీ మణుసు కనుక్కున్నాను. మా రావాఁలు కూంత సాహంతరంగా వుంటానికి సూత్తుంది యామే?”

“అదో నేరమా ? ఒకళ్ళలెక్క నాకులేదు.” అంది రావాఁలు దర్జాగా.

“దానికోళ్ళతోటీ కుదర్దు. అందులో కన్నయ్య అనే కుర్రోడు జారి పోయినప్పటేల నించీ—”

“నా నొద్దు వొద్దని మొత్తుకుంటూంటే ఆ పసోడి కల్లల్లో జిల్లేడి పసరోసి ఆడి కల్లోడిసేశాడు మా అయ్య: ముట్టెత్తుకోటానికి అంగుగా వుంటదని. ఆ గుడ్డికూన నేనాడక్కించుకోలేక పోనాను. నాయింట పీని గెల్ల!” రావాఁలు కళ్లలో నీళ్ళు గిర్రున్నాయి. తనకి, రావాఁలుకీ వొక కొడుకుంటే ఎంతబా వుండుననుకుని దిగులు పడ్డాడు వీరేసు.

“మీ పిల్ల —”

“మా పిల్లొవత్తి?” అన్నాడు అయ్య.

రావాఁలు —”

“ఓరి, పిచ్చోడ! కన్నయ్య నీ కొడుకవుతే, రావాఁలు నా కూతురవుద్ది. నాను దాని బాబునని బెమపడుతుండావు గాబాలు. అది దిక్కు లేక దేవుల్లాడుతుంటే దగ్గిరికి జేరదీశాను, సన్నీల్ల కుడుకునీళ్లు.”

“అయ్యా అని పిలిత్తే బాబనుకుండార్రా!” రావాఁలు నవ్వుకుంది వీరేసు వెర్రిబాగుల తనానికి. “నీ అమ్మాయికస్తంసూత్తే, మా యీరేచు గప్తికొస్తుండాడు.” అంది.

“ఓరు?” అన్నాడు వీరేసు.

“దీనితోటి యీరేచని వొక కుర్రోడుంటుండీవోడు మా గుంపుతో. ఓ పాలి రావాఁలు ఈ రేచుతో కన్నయ్య కడుపున పడ్డాడని మురుత్తా సొప్పిందంట. ఆ యీరేచు మాచెడ్డా అనుమానంవోడు. ఇంకో కుర్రోడొవడితోటో దీనికి సమ్మందం అవుండొచ్చని అనుమానంపడి రేతిరి సిత్తుగా తాగొచ్చి దీన్ని సితకదన్నేసి ఉరికేసినోడు. మల్లీ ఐపునేడు ఈ యేలటి దాకా. సూశావా, ఇలాంటివన్నీ వొత్తాయి” అని చెప్పాడు అయ్య.

వీరేసుకి ఉద్రేకం ఎక్కువై వొళ్ళు వేడెక్కింది; ఒకసారి ఏడవాలని పించింది కూడాను.

"నా సత్తెప్రమాణికంగా సొప్పతున్నాను. ఈ నిశిరేతిరి కాడ—"

"అంత ఆదరసంగా కుదురుద్దా? ఇప్పుడది దాని యిట్టాయిలాసంగా వుండాద్ది. వోల్లు పాడవుద్దే, వొద్దే అని పెద్దోణ్ణిగాక సొప్పతూనే వుంటుం డానమ్మో. నాక్కాతంత గెంజికాసి పోత్తది."

"నానరగాపట్టుకురాగల్దును కూంతో, కొంతో, 'కల్లు నేని కబోదినుండి బాబయ్యా! రొండు కల్లూ నేవు నారాయనా! దారే పోయే దరమాత్తుము లిక దయానేగు; కల్లు నేవు!' అని రోడ్డోరగ కల్లర్రొండూ మూసుక్కూకుండి యీ పదం పాడితే రోజా పావలా డబ్బులు రాల్తాయి. మనమంతా కల్లేసుకుని తాగొచ్చు."

"పచ్చుతం వుండులే. తరవాతాలోసించుకుందాం. నేనూ కొన్నాల్లు కూలీ, నాలీ సేసుకుండి గౌర్నంగా బతికినోణ్ణే." అన్నాడు అయ్యా.

"ఇగ తొంగుందాం, అయ్యా, నిద్దరొత్తుండాది: అట్టే రేతిరి నేదింక" అంది రావాఁలు. అయ్యా చుట్ట ఆర్పి మూటలో భద్రంచేశాడు. వీరేసు రావాఁలు పక్కెయ్యడం చిత్రంగా చూస్తున్నాడు.

పక్క గుంపులో ఒక కుర్రాడు లేచి, 'చల్, మోహానరంగా!—నీకూ నీవారులేరూ, నాకూ నావారులేరూ-' అని హాయిగా పాడుతున్నాడు.

రావాఁలు మూటలోంచి మూడు పెద్ద గుడ్డలుతీసి ముగ్గురికీ పక్కేసింది. ముగ్గురూ పడుకున్నారు.

అయ్యా వెంటనే గుర్రుపట్టాడు. రావాఁలు నిద్దర్లో ఒక కాటూ, వొక చెయ్యీ వీరేసుమీద వేసింది. వీరేసుకి నిద్దరట్టలేదు. నెమ్మదిగా రావాఁలుకి దగ్గరగా జరిగాడు.

ఉన్నట్టుండి రావాఁలు వులికిపడి లేచి వీరేసు జుట్టట్టుకుంది. "అమ్మ, యీరేసూ, నువ్వేనా? నువ్వే! మల్లీ యీసాయిపాల కెందుకొచ్చావు? నన్నా దగాసేత్తావు? ఏగం ఎల్లిపో. పో. ఇగ నీకూ నాకూ కలవదు. పోవేం; అయ్యా లెగిత్తే సంపుతాడు. అని వూరికే శివెక్కినట్టు అరుస్తోంది.

అయ్యా కలతనిద్దర్లో "ఏంటది!" అన్నాడు.

వీరేసు లేచి దులుపుకుని. "రావాఁలూ, నీమీద బెమ పోనేదు. కన్నయ్య మన కొడుకని కనలేక పోయాను. నీ కన్నాయం సేశాను. పోతుండా" అంటూ ఆ వేగుచుక్క వెల్తురులోంచి వెళ్ళిపోయాడు.

ఇప్పుడు బాంబులు పడితే బావుండును అనుకుంది రావాలు.

ఊళ్లోవాళ్ళంతా ఇలా వెళ్ళిపోతే ముష్టివేసేవాళ్ళెవరూ వుండరేమో అని కించపడ్డాడు మెలకువ వచ్చిన అయ్య.

# ఫిరంగి మోత

రోడ్డుమీద కనుచీకటిలో రెండు కుక్కలు పళ్ళుపైకి పెట్టుకొని సుందోపసుందులులాగ హోరాహోరీని కొట్లాడుతున్నాయి. మరోకుక్క కొంచెం దూరంగా కిక్కురుమనకుండా దీనిపర్యవసానంకోసం కాబోలు నిరీక్షిస్తూ నుంచుంది. ఈదుందుభిధ్వానంతో శివయ్యకి చీకటితోటే మెలకువొచ్చింది. ఉండేటందుకు కొంపంటూ వుంటే తలుపూ, గోళ్ళెమూ వుండి యిలాంటి వికృత ధ్వనులూ, దృశ్యాలూ వినపడవు, కనపడవు. స్వతస్సిద్ధమైన సంఘ మర్యాదలలోని లోపాలు స్వార్థపరులు పురాకృత కర్మమని ప్రచారం చేస్తే నమ్మి అనుభవించే శివయ్యవంటి రోడ్డువార చెట్టుక్రింద జీవనం వెళ్ళబుచ్చే ప్రాణులకి ఇటువంటి ఈతిభాధలు తప్పవు.

శివయ్య లేచి కళ్ళు నులుముకుంటూ "ఛీ! ఛీ!" అని అదలించాడు. కుక్కలు పది బారలదూరం తిరోగమించి అక్కడ మళ్ళీ ద్వితీయ యుద్ధరంగం స్థాపించాయి; మూడోకుక్క శాంతిదేవతలాగ సాక్షీభూతంగా అక్కడే నుంచుని ఆలోచనలో పడింది. ఈకుక్కల గందరగోళం చూస్తే పూర్వ పురాణాల్లో వర్ణించిన రాచకన్నెల స్వయంవరాలు జ్ఞాపకం వస్తాయి. కుక్కలు మహా చెడ్డవి. అవి సిగ్గూ సభ్యతా ఎరగవు.

శివయ్య కింక నిద్రపట్టలేదు. పక్కని పడుకున్న చిన్నమ్మని నెమ్మదిగా తట్టి లేపాడు. చిన్నమ్మకీ నిద్రాభంగం అయింది. ఒకసారి బద్ధకంగా ఆవలించి విసుగులో "ఇప్పుడుకాదు" అని గదిమింది.

"ఏం, ఇయ్యా లలా కస్సుమంటున్నావు ?"

"నాకు తలనొస్తోంది" అని వొత్తిగిలి నిద్ర నభినయించింది చిన్నమ్మ.

ఊరికి వుత్తరపుకడని వొక చెట్టుక్రింద శివయ్యా, చిన్నమ్మా కాపరం వుంటున్నారు; కాపరం ఏమిటి, దిబ్బ-కలిసి వుంటున్నారు. చిన్నమ్మ వొళ్లు కనబడీ కనబడకుండా కప్పిన వస్తువుని ధైర్యంచేసి చీర అంటే

చిక్కు వుంది. అది వొకప్పుడు కొంచెం శిథిలమైన కోరాదుప్పటి. వెనక వొకనాడు వుదయం తలుపు తెరచేసరికి ఎదురుగా ప్రత్యక్షమైన చిన్నమ్మ వేషం చూసి సిగ్గుపడి వొక యిల్లాలు దానిమెకి బహుమానంచేసి దాసీ మనిషితో గర్షణ పడింది.

ఓడిపోయిన కుక్క కాబోలు వొకసారి వొళ్ళు విరుచుకుని, చెవులు టపటపలాడించి ఏదో పని వున్నట్టు ఆ దారినే పరుగెత్తుకు పోతోంది. రెండురోజులనించి పేరుకుంటోన్న శివయ్య అనుమానం గడ్డకట్టింది. అతను చటుక్కున లేచాడు. శివయ్యకి కొంచెం తల మాసింది. పిల్లిగడ్డం కూడా వుంది. అతని వాలకంచూసి చిన్నమ్మకి భయంవేసింది. "ఎక్కడికి పోతున్నావు?" అంది. అతను మాట్లాడకుండా పోతున్నాడు, నిద్రలో నడుస్తోన్నట్టు.

"మళ్లీ ఎప్పుడొస్తావు?"

"నీకు తలనెప్పి తగ్గాక" అని వెనక్కి తిరగకుండా మెరిగి వెళ్లి పోయాడు.

చిన్నమ్మకి మళ్ళీకలత నిద్దరపట్టింది. తను పురుడు పోసుకున్నట్టు కల వచ్చి దిగ్గునలేచి సాలుగువైపులా శూన్యంగా చూసింది; ఆమెగుండె దడ దడ కొట్టుకుంటోంది. చెట్టుమీద పిట్టలు నీరెండలో పోరు పెడుతున్నాయి.

◆ ◆ ◆

కొంచెం దూరంలో ఒక పెద్దభవనం ముందు జనంగుంపుకూడి వున్నారు. ఆ గుంపు వెనక రెండు మిలటరీ లారీలు; మిలటరీ లారీ క్రిందపడి ఎవడో చచ్చిపోయాడు కాబోలు; కొన్ని పోలీసు టోపీలుకూడా ఆజనంమీద తేలి ఆడుతోన్నట్టు కనబడుతున్నాయి. పైకిచూస్తే ఆ భవనంమీద వొక పెద్ద చీరంత రంగురంగుల జండా ఎగురుతోంది.

శివయ్యవాళ్ళని సమీపించి ఆజనంలో చొరబడి ఒకణ్ణి అడిగాడు, "ఈ హడావిడంతా ఏమి"టని. ఇక్కడ యుద్ధంలోకి సిపాయిలని చేర్చుకుంటు న్నారు" అని జవాబు చెప్పాడింకొక ఆసామి.

ఒక పోలీసు దగ్గరకెళ్లి "నన్ను లోపలికి పోనిస్తారా?" అని అడిగాడు శివయ్య.

"ఎందుకు" అన్నాడు పోలీసు ఎగాదిగా చూసి.

"లోపలేం జరుగుతోందో మాద్దా మని"

"వీల్లేను"

"నేనరగా విద్దంసేత్తాను"

"గొప్ప యోధుడివి బయల్దేరావు- లోపల అధికార్లున్నారు. వారు పిలవందే లోపలికి పోకూడదు"

"వారు నన్నే మెరుగుదురు పిలవటానికి. నేనే యెలితే బాగుంటది."

"ఓహో, అట్టే అధిక ప్రసంగం చెయ్యక దూరంగావుండు. నిన్ను అఖర్ని పంపుతాను"

శివయ్య కిదిప్పుడప్పుడే తెమిలేటట్టు కనబడలేదు. పోలీసు యేమరుపాటున వున్నప్పుడుచూసి జనాన్ని దూసుకుని ద్వారండగ్గిరకి చొరబడ్డాడు. "ఏయ్, ఆగు, పట్టుకో" అని పోలీసు మతిపోయిన వాడిలాగ అర్చి ముందుకి పరుగెత్తాడు.

ఇంతలో లోపల్నించి ఒక సార్జెంటువచ్చి "ఏమిటా గోల?" అన్నాడు.

"వీడెవడో లోపలికి వస్తానని పేచీపెడుతున్నాడు" అన్నాడు పోలీసు భయంతో.

"వాణ్ణాపుచెయ్యలేకపోతే నువ్వెందుకిక్కడ?" అని సార్జెంటు గుడ్లురిమి శివయ్యని జబ్బపట్టుకొని లోపలికి యీడ్చుకెళ్లాడు; అధికార్లు ఆ అల్లరి చేసినవాణ్ణి ముందు లోపలికి తీసుకురమ్మని వుంటారు!

లోపల హాలులో పెద్ద ఆఫీసు: ఒక బల్లదగ్గర కుర్చీలో వొక అధికారి కూర్చున్నాడు. మరో చిన్న బల్లదగ్గర ఒకామె మిలిటరీ దుస్తులలో కూర్చుని కాగితాలమీద ఏదో రాస్తోంది; ఆమె ప్రక్క క్రింద గొలుసులోవున్న కుక్క వొకటి కూర్చుని అలసిపోయినట్టు వగరుస్తోంది. కుక్కని చూడగానే శివయ్యకి చిన్నమ్మ తలనొప్పి తలపుకొచ్చింది. సార్జెంటు తనను మిలిటరీ అధికారికెదురుగా నుంచోపెట్టాడు. శివయ్యకి మిలిటరీ సలాము చెయ్యటం వచ్చును; చేశాడు.

అధికారి అడిగాడు "నీకేంభాష వచ్చును?"

"మీ దయవల్ల తెనుగు, అరవం, తురకం మాట్లాడగల్గుదును."

"నువ్వేనా బయట అల్లరిచేస్త?"

"అల్లరికాదు, సామీ, లోన కిల్లనీమన్నాను"

"యుద్ధంలో సిపాయిగా చేరాలనుందా నీకు?"

" ఉన్నాదండి. నాకు యిమానంలోంచి గొడుగేసుకుని కిందకి దిగాలన రగా వుంది."

"ఎక్కువగా మాట్లాడకు - అడిగిందానికే జవాబుచెప్పు" అన్నాడు సార్జెంటు.

"మరి నా మనసులోవున్న కోరిక అదికార్లకి సెప్పకుండా ఏలా తెలుస్తది?"

"చెప్, చేతులు కట్టుకో" అని ఆదలించాడు సార్జెంటు.

"ఏ మెట్టి కట్టుకోను?"

సార్జెంటుని వూరుకోమని సంజ్ఞచేసి ఆఫీసరు, "నీ పేరేమిటి?" అని అడిగాడు.

"శివయ్య"

"నీ తండ్రి పేరు?"

"నాకు తండ్రిఅయినా తల్లిఅయినా ఇంక తమరే"

"అదిసరే, మీబాబు పేరు చెప్పు"

"నాకు తెలవదు"

ఆ మిలిటరీ అమ్మి అధికారి మొహంకేసి వోసారిచూసి మళ్ళీ తలవొంచు కుని రాసుకుంటోంది.

"నీ అడ్రస్ ఏమిటి?"

"అదేంటో నాకు తెలవదండి"

"నీ కేదైనా వుత్తరం రాస్తే ఏమని రాస్తారు?"

"నా కిదివర కెప్పుడూ వుత్తరాలు రాలేదు. ఎవరు రాస్తారు?"

"మేం రాస్తామనుకో"

"అంతా కులాసాగావున్నారని రాయిత్తే బాగుంటది"

అధికారి కిదంతా చిత్రంగా వుంది.

"నీకు కావలసినవా రెవరున్నారు?"

శివయ్యకొంచెం తటపటాయించాడు;

"చిన్నమ్మ"

"చిన్నమ్మ నీకేమవుతుంది?"

"ఏమీ అవదు!"

అధికారి ఓడిపోయాడు.

"నువ్వెక్కడుంటావు?"

"ఫలానాచోటు అని లేదు; ఎక్కడ యీలుగా, అంగుగా వుంటే అక్కడ."

"వీడు సర్వవ్యాపిఅయిన భగవంతుడు కాబోలు" అని నవ్వుకుని, "నీ వృత్తి ఏమిటి?" అని అడిగాడు పట్టుదల విడవకుండా అధికారి.

"అదేటో నాకు తెలవదండి, బాబూ"

"నువ్వేం పనిచేస్తావు?"

"తమ రేం చెబితే అదే చేస్తాను."

"అదికాదురా నువ్వు తిండి కెలా సంపాదించుకుంటావు?"

"దానికంతా వున్నాదిలెండి-మొన్నటిదాకా బియ్యంసంపాయించి వుడకేసుకు తినీవోళ్లం ఇప్పుడు బియ్యానికి కరువొత్తే డబ్బులు సంపాదించి కాఫీ హోటెల్లోకెళ్లి తింటున్నాం. ఇప్పుడే బాగుంది; మునపటంత అవిదిలేదు."

అధికారికి జ్ఞానోదయం అయింది. "అయితే నువ్వు అడుక్కుని బతుకుతూంటావన్నమాట?"

"అందులో తప్పేముందయ్యగారూ? ఇన్నాళ్లూ వొకళ్ల చేతికింద్ అప్పుడూ పనిచెయ్యలేదు. స్వేచ్ఛగా బతుకుతున్నాను. అడుక్కున్నా వొక్కర్ని కట్టపెట్టను; ఆరుకావాలని యిత్తే పుచ్చుకుంటాను."

"సరే. నీలాంటివాళ్లింకా ఎంతిమంది వున్నారు? కుంటీ, గుడ్డీ లేనివాళ్లు?"

"అబ్బో, శానామం దున్నారండి, కొంతమంది పగటేల అడుక్కునీ చమయంలో కుంటిగానూ, గుడ్డిగానూ వుండి రాతిరేలకి మామూలుగా మసుల్తారు. కొంతమంది బాగావున్నా ఆడోళ్లకి సందాల సిపాయీలంటోళ్లు డబ్బులిచ్చగగా పోతుంటారు."

"బాగావున్న మీవాళ్లంతా యుద్ధంలోకి వస్తారంటావా?"

"ఆడోళ్లా?"

"అబ్బ, కాదురా మొగాళ్ళు?"

"చెప్పలేనండి. నాకు ఋమానం నడపాలని చగదాపుట్టి వొచ్చాను. గాని, వాళ్ళొప్పుకోరు. వాళ్లకేమీ కష్టంలేకుండా హాయిగా గడిసి పోతోంది."

"అయినా, నువ్వొక పనిచెయ్యి. నిన్ను సిపాయిల్లో చేర్చుకున్నాము. నీకు కడుపునిండా తిండి పెడతారు; మంచి గట్టి ఖాకీబట్టలిస్తారు—చూడు ఈ సార్జెంటు తొడుక్కున్నలాంటివి. ఏమంటావ్ ?"

"చిత్తం."

"నువ్వు సాయంత్రం మీవాళ్ల దగ్గరకెళ్లి ఇదంతా బోధించి ఎంతమంది యుద్ధంలో చేరతారో తెలుసుకుని రా; ఏం?"

"చిత్తం-మరి నన్ను ఇమానం మీంచి గొడుగేసుకుండి దిగనిత్తారాండి?" అమాయికుడు.

"ఓ" అన్నాడు అధికారి చిరునవ్వుతో "సార్జెంట్"

"సార్"

"ఈ శివయ్యకి కడుపునిండా తిండి పెట్టించి బాగా తయారు చేసి వాళ్ళవాళ్ళుండే చోటికి లారీలో తీసుకెళ్ళు"

"చిత్తం."

"ఆ పల్లెటూళ్ళనించి వచ్చినవాళ్లని మధ్యాహ్నం హాజరు పెట్టు."

"చిత్తం" అని సార్జెంటు మిలిటరీ శాల్యూటుచేసి శివయ్యని బయటికి తీసుకెళ్ళాడు.

అధికారి, "తంగం; నాకో గొప్ప ఊహ తట్టింది" అంటూ బల్లమీద టెలిఫోన్ తీసి డయల్ చేశాడు. ఆమె అతనికేసి ఆశ్చర్యంగా చూసి వూరుకుంది.

అధికారి, ఫోనులో "కార్పొరేషన్ కమీషనర్ గారిని పిలవండి వో సారి" అన్నాడు. ఒకనిమిషం పోయాక, "హల్లో, కమీషనర్ గారా, నమస్కారం. చూడండి-మాననగరంలో తినడానికితిండి, ఉండటానికి కొంప లేనివాళ్ల సంఖ్యఎంత వుంటుంది...ఆఁ, అవును...రోడ్డువార పేవ్‌మెంటుమీద బ్రతికేవాళ్ళు...అబ్బ, సుమారు డబ్భయి వేలా!...యుద్ధంలోకి సైనికుల్ని చేర్చుకుంటూంటే ఒక చిత్రమైన కేసువచ్చింది. దానితో నాకో అద్భుతమైన వూహ తట్టింది...మరీ...చూడండి, ఒక వేళశత్రు విమాన

దాడి వస్తే మననగరానికి బాంబులకంటే ముష్టివాళ్ళవల్ల ఎక్కువ నష్టం, ప్రమాదంవుంది. పౌరుల ఆస్తులని వీళ్లనుంచి రక్షించడం దుర్ఘటమౌతుంది- వీళ్ళల్లో కట్టులేక పోవటం కొంచెం మెరుగనుకోండి... ఆఁ, ఏమంటారు? మీరూ దీన్నిగురించే రోజూ ఆలోచిస్తున్నారా?... ఇంకొకటి, ఈబియ్యం లేపనింగు రోజుల్లో చూశారూ, ముందుగా తిండిలేక రోడ్లమీద చచ్చిపోయేది ముఖ్యంగా వీళ్లే... దానితో పేపరువాళ్ళంతా గవర్నమెంటుమీద సాముచేస్తారు. నగరంలో రోడ్లమీద రోజుకి అన్నంలేక ఎనభై నలుగురు చచ్చిపోయారు. ఏభైఆరు శవాలకి మాత్రమే రోజుకి సంస్కారం చెయ్యగలుగుతున్నారు- గవర్నమెంటు ఏం చేస్తోంది: నిద్రోతుందా? ఇలాంటి వన్నీ రాస్తారు. కనుక యిలాంటి ఓహాయిత్యాలనించి నగరాన్ని వుద్ధరించటానికి నాకో వుభయతారకమైన పద్ధతి తోచింది. ఏమిటంటారా? ఇప్పటివరకూ మనం కొద్దో గొప్పో తెలివైనవాళ్ళని చేర్చుకుంటున్నాం. రేపు బర్మాదండయాత్రలో భూసైన్యం వుపయోగించేప్పుడీ తెలివైనవాళ్లని శత్రు ఫిరంగులకి ఎరచెయ్యడం అంతమంచిదికాదు. ఆ దుర్గమమైనకొండల గొరిల్లా యుద్ధంలో ఇలాంటి మోటువాళ్ళని ముందు వుంచితే వెనకాల మంచివాళ్లు వెళ్లి ఆక్రమించుకుంటారు. మన నగరంలో నిరాధారమైన యీ జీన్‌వాల్‌జీన్‌లాంటి డబ్భయివేలలోనూ కుంటీ, గుడ్డీ తీసేస్తే, పనికొచ్చేవాళ్లోక పాతికవేలమందైనా కనీసం వుంటారని నా నమ్మకం-వీళ్ళందర్నీ వెంటనే సైన్యంలో చేర్చెయ్యాలి.

ఈ సంఘముక్షీకాల ప్రమాదం ఇలాతగ్గించవచ్చు. ఇలాగే దేశంలో వున్న అంగవైకల్యం లేని ముష్టివాళ్ళ నందర్నీ రిక్రూటు చేయించదల్చుకున్నాను. వీళ్ళల్లో వట్టి గుడ్డివాళ్ల చేత కూడా మనం పనిచేయించుకోవచ్చు. వీళ్ళకేం కావాలి? తిండీ, గుడ్డ; అవి మనం యిచ్చి వీళ్ళద్వారా మన ప్రయోజనం సాధించుకోవచ్చు. ఈ విషయం మన కమ్యూనిష్టు సోదరులకి వప్పచెబితే వాళ్లు అద్భుతమైన ప్రచారంచేసి మన సైన్య సమీకరణానికి చాలా సాయంచేసి తీరుతారు. సంఘంలో వున్న యీకుళ్లు సంగతి వాళ్లకి తెలిసినట్టు ఇంకే రాజకీయకక్ష్యవాళ్ళకీ తెలియదంటాను.... ఈ అభిప్రాయం మీకు నచ్చినందుకు నాకు చాలా సంతోషంగావుంది... అసలు నేను మీ దగ్గరకొచ్చి... ఇదంతా మాట్లాడవలసింది గాని ఉత్సాహం పట్టలేక ఫోన్లో

చెప్పేస్తున్నా. సాయంకాలం సావకాశంగా దర్శనం చేస్తా..."

ఆమిలిటరీ వుద్యోగస్తురాలు అధికారి మేధాశక్తికి విస్తుపోయి చూస్తోంది.

సార్జెంటు భావి సైనికులని బారులు తీర్చిరోడ్డుప్రక్క శిబిరంకేసి నడిపించుకు పోతున్నాడు.

"చివయ్యా, చివయ్యా" అనికేక వినపడి శివయ్య నిర్ఘాంతపోయి నుంచున్నాడు; రోడ్డునలుప్రక్కల పరకాయించాడు. ఒకనల్లనికొంత తెల్లని మల్లెపువ్వు లాంటీ చీరతో అతనికి సాక్షాత్కరించింది.

శివయ్యకి ఆశ్చర్యం వేసింది:

"చిన్నీ, నువ్వే?" అన్నాడు. చిన్నమ్మ "ఔ" నని చిరునవ్వు నవ్వింది.

"నీకేలో కొవడిచ్చాడుకి?" అని నిలేసి గద్దించాడు శివయ్య.

"యీదిలోకి రావటానికంగుగా వుంటదని సాకలోరి గూడెంలోకెల్లి దీన్ని అద్దికుచ్చుకున్నాను; గుడ్డ సరిగాలేకపోతే డబ్బులిచ్చీ మారాజులు భయంపడి కల్లు మూసుకుపోతున్నారు మరి"

శివయ్య తొజుపడ్డాడు, జేబులోంచి గుప్పెడు డబ్బులు తీసి ఆమెచేతిలో పోశాడు.

"యీల్లెందుకు నిన్ను తీసుకుపోతుండారు ? దొంగతనం సేశావా ?" అంది చిన్నమ్మ అవి పుచ్చుకుని.

"లేదు. నేను రంగమెల్లిపోతాను; విద్దంలో చేరాను"

"నన్నిడిసిపెట్టేశా ?" అని దీనంగా కళ్లు చెమ్మచేసుకుంది చిన్నమ్మ.

"తొందరగా రావాలి" అని సార్జెంటు కేకేశాడు,

"నీకు తలనొప్పి తగ్గేయేలకి నేను యిమానంలోంచి గోడుగేసుకుని నీ పక్కని దిగుతాను"

అంటూ శివయ్య వెనక్కి తిరిగిచూస్తూ నడిచి వెళుతున్నాడు తొందరగా.

"ఆఁ' ఆఁ!" అంది చిన్నమ్మ. ఒక కుక్క అతని కాళ్ళల్లోపడి అతను బోర్లపడ్డాడు. వెంటనే లేచి దులుపుకుని ఒక్క పరుగులో తన కాబోయే మిత్రుల్ని కలుసుకున్నాడు.

సార్జెంటు వాళ్ళని జాగ్రత్తగా నడిపిస్తున్నాడు రోడ్డుప్రక్కనించి శిబిరం వైపు.

కాలుస్తోన్న చుట్టజోగు గుండెలమీదపడి చుర్రుమంది. మా నాయనమ్మ, వొంట యింట్లో జమాబందీ అయింది కాబోలు, ఒక కుక్కిమంచంమీద మేనువాల్చి పాడుకుంటోంది:

"ఇదం కాష్ట మిదం కాష్టం
"నదీతీరేతి సంగమం,
సంయోగంచ వియోగంచ
కా తత్ర పరివేదనా ?"

అని మళ్లీ చుట్ట రెండు పీల్పులు పీల్చి ఆలోచనలో పడ్డాను. మధ్యాహ్నం రెండు గంటలయి వుంటుందనుకుంటాను.

# వూడుపులలో

నరసయ్య కాపు లావాటి నల్లరెక్క చుట్ట నోట్లో నానేసుకుని చేనుగట్టు మీద స్థిమితంగా కూర్చున్నాడు. ప్రక్కని పెద్ద యిత్తడి చెంబుతో నీళ్లున్నాయి, దాహంవేస్తే తాగడానికి. తలమీద ఎండపడకుండా తాటాకు గొడుగునీడ కాస్తోంది. గట్టుమీదే కొంచెం దూరంగా తూటకట్ట వొకటి నిశ్చలంగా నిలిచి కాలుతోన్నట్టు ధూమానలన్యాయంవల్ల తెలుసుకోవచ్చు. ఎదురుగా చేలో జానుదఘ్నమైన జలరాశిలో, రక్తవర్ణమైన రవికలు ధరించి రకరకాల రంభాస్తంభములవంటి ఊరురుచులూరుచు, చీరలు కచ్చాబిగించి సుమారు పాతికమంది పేరంటాళ్ళు బారుతీర్చి, వొక్క మనిషిలాగ వొంగుని పాడుతూ వరిమొక్క లూడుస్తున్నారు. ఆబృంద గీతంలో కొత్తకొత్త రకాల ప్రాణుల కూత లెన్నో కలియబడి ఇంగ్లీషు ఆర్కెష్ట్రాతో పోటీపడుతున్నాయి. వెనకాల కొంచెం దూరంలో వొక చిన్న చెరువు, గట్టుమీద పెద్ద పెంకుటి దూడలపాక కనబడుతున్నాయి. సాయంసమయం సమీపించిన కొద్దీ సంగీతం సన్నగిల్లుతోంది. ఉదయాన్ని కారు మబ్బులు నచ్చాచనే వుక్రోషంతో సూర్యభగవానుడు తుది సారి మొహం ఎర్రగా చురచురలాడి టోబ్రుక్ వైపు తిరోగమిస్తున్నాడు.

నరసయ్య కాపుకి నలభై యేళ్లున్నాయంటే నమ్మలేం. దృఢమైన శరీరం. గునపంతో గొప్పతవ్వి కండలు తేలిన జబ్బలు; కానిడిమాసి కాయలు

కాసిన బుజాలు. మెరుగు చామనచాయ మేను; కళ్లల్లో భాగ్యపు పెర్ర జీరలు. ప్రొద్దుట మంగలిచేత దువ్వించి నీటుగా ముడిపించుకున్న ముచ్చటన్నా ముడికొంచెంసడలి, మొహం మీాద ముసిరే ముంగురులు వడితిరిగిన మీాసాలతో మేలమాడుతున్నాయి. అతని చెవలకి మెరిసే వొంటిరవ్వ తమ్మెట్లు, చేతివేళ్ల వుంగరాలు, లంక గుమ్మడిపండంత బొజ్జ చూస్తే కాస్త సితిమంతుడే అని తోస్తుంది. నరసయ్య కాపు సంసారాన్ని గురించి ప్రత్యేకంగా తెలుసుకోవాలంటే. అతనితోపాటు ఆ సాగరంఅంతా మనంకూడా యీదినంత పని అవుతుంది. గనక అట్టి వుద్దేశాల్నుండి విరమించడం వుత్తమం.

మంగమ్మ పాటశ్రుతిలో కలిపి ప్రక్కనున్న పాలికాపుతో మధ్యమధ్య వూసులాడుతోండడం చూసి నరసయ్యకాపు "అలా చూస్తారేం? కాస్త బేగి బేగి వూడ్చెయ్యండి, పొద్దు గూకిపోతోంది" అని కూలీలని అదలిస్తున్నాడు.

మొగకూలీ లొక కొత్తపాట నెత్తుకున్నారు; ఆడంగులు మడి విడిచిపెట్టే వేళవుతోందనే వుత్సాహంతో ఆఖరుసారి ఆక పడుతున్నారు.

శేషమ్మలేచి వొకసారి చేతులు దులుపుకొని ముంగురు లెగదోసుకుంది; నడుం చేతులతో నొక్కుకుంటూ నిటారుగా నుంచుంది. ఆమె వెనకాల ఎర్రగా మండుతోన్న సూర్యబింబం తలనించి నడుముదాకా ఆవరించి ఆమె పచ్చని శరీరాన్ని వొక్కసారిగ వెలిగించింది.

"నడుం నెప్పడుతోందేటె, చేషీ?" అని ఆమె కుశలం కనుక్కోబోయాడు నరసయ్య,

"చేసేంటండి, చేసీ గీసీసి? నేనేం కుక్కనా?" అని కోప్పడింది శేషమ్మ.

"ఓహోహో, కూలిడబ్బులకొచ్చి నీకింత గోశేంటొలే?" అన్నాడు నరసయ్య.

"ఒలే గిలే అనమాకండి. కూలికొస్తే మాత్తరం, ఎవరిగొర్నం అంది"

"మ రేమనమంటావ్?"

"శాసమ్మా అని పిలవమంటుందుండి" అంది శేషమ్మ పక్కనున్న ముసిల్ది

ఈ సారి నరసయ్యకి నడుంజారింది. ఏమనడానికీ వెంటనే తోచక వూరు

కున్నాడు. కాని శేషి సెలాగైనా మెడలు వొంగదియ్యాలనే పట్టుదల అతన్నావహించింది. ధిక్కారం పొందినందుకు అభిమానం తెంచుకుంటే అసలు కథ చెడుతుందని కోపం దిగమింగి సామోపాయం సాగించ దల్చుకున్నాడు. శేషి మొహమాటం తీసేసినకొద్దీ నరసయ్య కామెమీద మోజెక్కువయింది.

శేషమ్మ తక్కిన కూలీలలాగే యీడిగాళ్ల ఆడపడుచు. అదివరకొక మిల్లులో పనిచేసేది; ఆ వేళే కొత్తగా వూడ్పుల్లోకి వచ్చింది. శేషమ్మని మొగుడు విడిచిపెట్టాడో, మొగుణ్ణి శేషమ్మ విడిచిపెట్టిందో తెమల్చటం అంత సులువైన పనికాదు. శేషమ్మ పెనిమిటి రంగంలో వున్నాడనిమాత్రం చెప్పుకుంటారు. శేషమ్మ మొహాన్ని కెంపులుచేసే కుంకంబొట్టు చూసి ఆమె భర్త బ్రతికేవున్నాడని ధైర్యంచేసి చెప్పడానికి వీలూలేదు. శేషమ్మ ప్రస్తుతం తల్లి ముండతో కాపరం చేస్తోంది.

శేషమ్మ వొంగుని వూడుస్తోన్నప్పుడు, వొయ్యారంగా వొళ్లు విరుచుకున్నప్పుడు, వుండుండి వూరికే నే పచ్చని పళ్ళవరస కనపడేలాగ నవ్వుతూ వోణీ సద్దుకున్నప్పుడు వివిధ పోజుల్లో ఆమెని నరసయ్యకాపు ప్రొద్దుటి నించీ విభ్రమతో విలోకిస్తున్నాడు, తనకేసి చూసిందనుకున్నప్పుడల్లా వెకిలిగా నవ్వుతూనూ వున్నాడు.

చుట్టూ ఆవరించిన సూర్యబింబంలో మండిపోయే శేషమ్మ శరీరసౌష్టవం చూసేసరికి నరసయ్యగుండె వొకసారి గొంతుకలోంచి పైకి వచ్చి, పళ్ళ సందున ఇరుక్కుని వొక్కువుటున పైకి దూకెయ్యడానికి ప్రయత్నించింది. కాని శేషమ్మ చెప్పినపాఠం గుర్తుకొచ్చి వినయంగా,

"నువ్వరగా పదం పాడటంలేదేం, శాసమ్మా?" అన్నాడు అఖరికొక చుటక వేశాక.

"నా పదం యినాలనుందేటి మావు?" శేషమ్మ కళ్ళు చారడేసి అయాయి కాపు తనని శేషమ్మా అని సంబోధించినందుకు; మొహం మరింత ఎర్రబడింది,

"ఏదీ, పాడు: వూడుత్తూ పాడు"

"నా పాటంత బాగోదుండి" శేషమ్మ కిలకిలలాడింది.

"అరివాడి తస్సాగొయ్యా! నేనెరగందేంటి" అని వుబ్బేశాడు.

శేషమ్మ మళ్లీ వొంగుని ఊడుస్తోంది; ఆమె కొప్పులోంచి పువ్వులు కురిశాయి.

చందమామపదం జరుగుతూనేవుంది. చంద్రుడుకూడా దక్కొచ్చాడు.

ఇంతలో 'అమ్మయ్యో! అమ్మయ్యో' అంటూ మంగమ్మ కచ్చావిప్పుకొని గంతువేసింది. "ఏమిటేమిట"ని కూలీలంతా ఆమెచుట్టూ మూగారు. వాన పాముపిల్లవొకటి మంగమ్మ కుచ్చెళ్ళలోంచి మిలమిల మెరుస్తూపడిలిపోయి నీళ్ళలోకిదూకింది. పాలికాపు స్వామి దాన్ని వెంటనే తరమిపట్టి వధించాడు. ఆడకూలీలంతా వొకసారి అప్రయత్నంగా కచ్చాలు విప్పి దులుపుకొని మళ్లీ సద్దుకున్నారు. "మెల్లో మిలమిల మెదిల్తే ఏంటో అనుకున్నాను. ఇది మద్దానపేలనించీ నా బట్టలోనే వుందిగామోసల్లో!" అని మంగమ్మ శోకం పెట్టింది. నరసయ్య వికృతంగా నవ్వుతున్నాడు. "మరేంబయంలేదు. బట్టలో గట్టిగా కట్టేసినావు. నీకేకట్టు నిన్నేం చేస్తది?" అని వోదార్చారు పక్కనున్నవాళ్ళు. "ఇయాల నాకేదో మూడింది" అని యీ అపశకునానికి దిగులు చెందింది మంగమ్మ.

"సరే, ఆగట్టుకాడికా పెయ్యండియాలకి" సెలవిచ్చి వేశాడు. నరసయ్య నెత్తికి తాటాకు గొడుగు తగిలి పాగా నేలనిూదవాలింది. అది తీసి బుజం మీద వేసుకుని, చెంబు పట్టుకుని పాకకేసి దారితీశాడు కూలిబట్వాడాకి.

కులాసాతోకూడిన కూలి జనంపాట గుడ్డివెన్నెలలో దూరంగా వినబడుతోంది. మంగమ్మ వాళ్లతో నాలుగడుగులు వేసి ఏదో మరిచిపోయినట్టు తిరిగి పాకదగ్గరికి వచ్చింది. శేషమ్మ చెరువులో దిగి వొళ్ళు కడుక్కుంటోంది.

"ఏం, శాసమ్మా, ఇంకా యిక్కడేవున్నావు? అంది వెనకాలనుంచుని మంగమ్మ.

శేషమ్మ వులికిపడి, "కూలిడబ్బులకోసం, మంగమ్మప్పా. కాపు సిల్లర లేదని సామినాన్నని వూళ్ళోకి తోలేశారు" అంది.

"కాదు, కాపుకి కాల్లు పిసకటానికి. ఈయేశాలు నాకు తెలుసును."

"కాల్లుకాదు, పీకపిసుకుతాను; కాపుకాల్లు నేందెనుకు పిసుకుతాను?"

"ఒకత్తికి సిల్లర తక్కువయిందంటే అగుండి పిసుకుద్ది; రోజూ వొకత్తికి సిల్లర తక్కువొద్ది; నిన్న నాకు. ఇయాల నీకు!"

శేషమ్మకి అర్థమై నిలబడిపోయింది. "నిజమే, మంగమ్మప్పా? ఊడుప్పు

లన్నాళ్లూ సందాలపూట ఎప్పుడూ ఇక్కడొకత్తి దిగడిపోతుంటదా?'
అని ఆశ్చర్యంతో అడిగింది.

"ఊడుపులేంటి, నూరుపులేంటి—ఓపావలాడబ్బు లెక్కవిత్తే ఎందుకు దిగడకూడదు?"

"ఏంటీ, ఇక్కడా నూమిల్లులోలాగే నన్నమాట!"

"మీమిల్లులో యేంటి?"

"ఇలాంటి యేశాలే యేత్తే మాడైవోర్ని గూబ కదలేసినందుకే కాదూ నాపనోయిందక్కడ? పొద్దుటేలనించీ కాపువోలకం అనుమానంగానే వుంది సుమా."

"ఓస్, ఏం పతిత్తులవే! పావళా పైనిస్తే నీకుమాత్తరం సేదేంటి?"

"ఎదవపావళా! ఆ దుక్క సేనా తింటాంగాని—కూంత మన కల్లకి నచ్చాలంటావా?"

మంగమ్మకి కోపంవచ్చింది! "నచ్చిందేంటే, నా సైతికోనా! ఆడి డబ్బులకాసపడే నా కూట్లో దుమ్మొయ్య దలుసుకున్నావు. నాకాడంటే నే దాపరకాలు?" అని లేచింది.

శేషమ్మమాత్రం శాంతంగా, "సూడు. అప్పా, నీ కూట్లో దుమ్మేస్తే నాకేమొస్తది? ప్రమాణికంగా నాకిదేం తెలవదు. నా మణుసు కని పెట్టలేకపోయావు. సూడు, నాకేడితోనా? ఈడి ఆందం అడుక్కుతిన! నాదరిమేనా కొత్తే సంపుతా" అంది.

మంగమ్మ కొంచెం తాజుపడి, "ఏంటీ" అంది నమ్మలేక.

ఈఘర్షణవిని నరసయ్యకాపుపరుగెత్తుకొచ్చాడక్కడికి; మంగమ్మనిచూసి మండిపడుతూ, 'ఏమే, మంగీ, నువ్వింకాయిక్కడేవున్నావు?' అన్నాడు.

"శాసమ్మకి తోడు" అంది మంగమ్మ పళ్ళమధ్యనిలచి.

"ఏం శాసమ్మకి బయమేంటి? దారిలో దొంగలు దోసుకుంటారా? అంతగా వొస్తే సామిగాడున్నాడుగా సాయం."

"ఎలాగూ వొచ్చానుగందా, పాక వూడిసి మరీ పోదామని."

"నువ్వొడ్చక్కర్లేదులే; శాసమ్మ వూడుస్తది. నువ్వింకెల్లు"

"అద్దరేతిరికాడ పాకూడ్చడమెందుకండి? ఇయాలిటి కిక్కడే తొంగుంటారా?" అంది శేషమ్మ ఎరగనట్టు.

“ఇంటికా డీలుగా వుండకు శాసమ్మా” అన్నాడు కాపు జాలిగా.

“మరైతే, శాసమ్మిపుడు రాదన్న మాట ?”

“ఆయనతోకేంటి, వుండు మంగమ్మప్పా, నేనరగా వచ్చేత్తాను; సామి నాన్న సిల్లర తేనీ” అంది శేషమ్మ.

“శాసమ్మా, నువ్విప్పుడప్పుడే కొంపకెల్లటం లేదు. అప్పుడే యెళ్ళి ఏంచేస్తావు ? కూడు ముసల్దే వుడకేస్తది” అన్నాడు నరసయ్య.

“కాపుగారికి కొల్లు పిసకాలి గామాలు” అంది శేషమ్మ వెటకారంగా.

“ఏంటే, అప్పుడే సెప్పేసిందేంటి ?- ఇంకా పోవేమే, మంగీ. అలా సూత్తావేం గుడ్లప్పచెప్పి; నీక్కూడా సెపుతోంట ?”

మంగమ్మ వుక్కురోషం పట్టలేకపోయింది:” ఎక్కడికయ్యా, యెల్లమంటావ్ ? నేనియాలిక్కడే వుంటాను, ఎంచేత్తావో చెయ్యి” అని ధిక్కరించింది మంగమ్మ.

నరసయ్యకి వొళ్లు మండింది. “ఏంటే, అపొగరుమోత్తనం ? యెల్లవ్ ? యెల్లకపోతే సామిగాడిచేత జుట్టట్టుగుని బరబరా యీడిపించేత్తాను; నా తమాసా చూద్దుగాని మరి. హుఁ” అని కేకలేస్తూ లేచాడు నిప్పులు తొక్కిన కోతిలాగ.

“అయితే, నేనరగా పోతాను మరి; అదేపోయిన డబ్బులు” అని బెదరించింది శేషమ్మ.

“దాన్ని పోనీ, శాసమ్మా” అని ప్రాధేయపడ్డాడు కాపు.

మంగమ్మకి వొళ్లు తెలియలేదింక,” కామందంటే కామందులాగుండాలి గాని, ఏంటయ్యా, నీ యేసం ? నిన్న పనికొచ్చినదాన్ని ఇయాల పనికి రాలేదూ ?” అని టొకాయించింది.

“ఓహోహ, ఏంటేవ్, నీపొగరు నాయిటం; నిన్న నీకు పైన పావలా డబ్బులిచ్చాను. ఇయాల నీ కూలి నీకు ముట్టింది. ఇంకిక్కడొక్క చణం అయినా నువ్వుండడానికీల్లేను. ఇంకల్లరి సెయ్యక పోతావాపోవా ?

“ఇయాల కూడా నా పావలా నాకిచ్చెయి, పోతాను.” అందిమంగమ్మ.

ఈ సారి నరసయ్యకి మండింది “ఇయ్యాల నీకు పావలా ఎందుకుకెక్కివియ్యాలి, వుత్తపున్యాన్ని ?”

“ఏంటయా, నీ వూసు? మాయింటతన్ని మాయసేసి నీకాడకొత్తూంట

నీ అందాన్నిసూసి వొలిచి వొచ్చాననుకుంటున్నావా; నా పావళాకికాక పోతేను ? ఇప్పుడాడబ్బులిత్తేనేగాని యిక్కణ్ణించి కదల్ను. చేసుకో. ఏంచేసుకుంటావో'' అని దరణా కూచుంది మంగమ్మ.

నరసయ్య ఆమెను కొట్టబోయే కొంచెం తమాయించి, ''అయితే వృదాగా రెండు పావలాలు కర్చన్నమాట ఇయాల నాకు శాసమ్మకి—''

''నీ యెదవ పావళా నీయెదాన్నెకొట్టు; నాకక్కర్లేదు. ఓక్ !—నీ వోలకం చూత్తే నాకు డోకొత్తోంది. మా డైవోరే మెరుగనిపించాడు !'' అని ఖాండ్రించి వుమ్మేసింది శేషమ్మ.

''నాకు నచ్చిన మాటాడేవు. శాసమ్మా'' అంది మంగమ్మ.

''అయితే అలాగేవుండు: సామిగాడు రానీ, నీ తుప్పతీయించెయ్యపోతే సూద్దువుగాని, ఆడితో మల్లీ ఏలాకాపరం చేత్తావో చూస్తాను'' అని మంగమ్మని బెదిరించాడు నరసయ్య.

''నా కాపరంమీద నీకు జాలికొమాలు, లేకపోతేను.''

మంగమ్మ యీమాటలంటూవుంటే సామి చక్కావచ్చాడక్కడికి; ఒక్క నిమిషంలో పరిసితి అర్థం చేసుకున్నాడు.

''యామే ? ఇంటికాడుండక ఇంకా యిక్కడే తచ్చాడుతున్నావు ? అన్నాడు భార్య, మంగమ్మని.

''నీతో సొప్పకూడదు'' అంది మంగమ్మ.

''ఒరే, నీ పెళ్లానికి కళ్ళు నెత్తిమీదకొచ్చాయిరా, సూడు దానిపోతరం'' అని అంటించాడు నరసయ్య.

''పద యింటి కీపాటికి. కాపుతో గర్సనేంటి ? నాకీ పాలికాపుతనం కూంతా వూడిందాకా అలా యేడుత్తున్నావు, అంతే'' అని మందలించాడు, స్వామి.

''సేత్తున్నావు, ఎలాగైతేనేం ముండాపాలికాపుతనం. అంతకన్నా అడుక్కు తినరాదూ ?'' అని యీసడించింది మంగమ్మ.

''ఏడిశావ్; ఎవరేనా యింటే అపర్దిట-నోరు ముయ్యి''

''నువ్వే ముయ్యి: నాకేం మూసేదాకాను? నా కియాలాయన పావళా యియ్యాల, అప్పుడిక్కణ్ణించి కదలాల''

స్వామి యింక ఓరిమి పట్టలేకపోయాడు. బలంకొద్ది చెయ్యి విసిరి

మంగమ్మ మొహంమీద కొట్టాడు.

"అఁ, అఁ;" అని ఆర్తనాదంచేసింది శేషమ్మ.

"రోగం కుదిరిందా ?" అని అగ్గాడు కాపు.

ఆ దెబ్బతో మంగమ్మ ఆకారం మరిడమ్మలాగ అయింది. ముంతంత కొప్పుముడి విడిపోయి సవరం తాళ్ళచుట్ట జారి కింద పడింది. కళ్లు కొలిమిలో నిప్పుల్లాగ మండాయి. వొంట్లోంచి కంపరం పుట్టుకొచ్చింది. పెదవులు అదిరిపోతున్నాయి. ఆమె ఏడవలేదు. శాంతంగా, "సామీ, ఇయేలదాకా నువ్వు నాకు మొగుడువి. ఇప్పటినించి నీకూ నాకూ ఏమీ సమ్మందం లేదింక" అంది.

"అదేంటి ని?" అన్నాడు స్వామి నివ్వెరపోయి.

"ఏంటా ? నీకు సిగ్గూ, ఎగ్గూ లేవు. నిన్నినాళ్లనుంచీ నేనే పోసిత్తున్నానన్నమాట కానలేక నన్నుకొట్టి నా వుసురోసుకున్నావు."

"బలే, సామిగాణ్ణి పెళ్లాం పోసిత్తోందట. అహాహా!" అని వికటహాసం చేశాడు నరసయ్య.

."ఎందుకయ్యా, నీతిమాలోన్నడా! అలా యికిలిస్తావు ? తప్పేముంది ? అది నాకనబమే !" అని సమర్థించింది శేషమ్మ.

నరసయ్య పళ్లు కొరకబోయి పెదిమి కరుచుకున్నాడు.

"ఏంటే, నువ్వు నన్ను పోసించేది, యెదవా ?" అని రోషంతో మళ్లా చెయ్యి ఎత్తాడు స్వామి.

"మళ్ళీ ఆ చెయ్యి పడినిచ్చావంటే బాగా జరగదు, సామి నాన్నా" అని బెదిరించింది శేషమ్మ.

"నీకు రోజూ ముప్పొద్దూ బువ్వెలాగొత్తోందిరా, బుద్ధిలేనోడా? నువ్వు సంపాయించిందెట్టేసి తెగతాగి రాత్తిర్లొచ్చి నన్ను తింతావా ? నీ జీతం ఏటికో పాలొత్తే అది నువ్వు సేసే అప్పులు కింద పోతాదా ? నేనిలాగ పైసరగా సంపాయించకపోతే మన మిన్నాల్లూ గంజెలాగా తాగుతున్నామనుకున్నావ్ ? నీ కిప్పుడేనా గానం కలిగిందా?" అని వెళ్ళబోసింది మంగమ్మ.

"ఏంటే, తాగడం తప్పంటావా ? రోజూ కొంపకి సేరుకునే తలికి యీదిగుమ్మంలో అప్పులోళ్ళూ, ఇంటో ఇయాలకి పత్తుండాలని నువ్వూ

దుమ్మెత్తిపోత్తాంటే తాగటం తప్పద్దా, మనసు కుదురగా వుండాలంటేనికి పైగా పైసరగా తెచ్చి నాకెట్టడం నీకు నీతా ?'' అని స్వామిభార్య నడ తలో తప్పలెంచబోయాడు.

''మన వరణానికి నీతిని కూకుంటే యెలా గడుస్తది ?—ఇప్పుడు కొడితే మానెలే-మనకి పిల్లలు లేకపోవడం మెరుగిచ్చింది—ఇదిగో నేనికట్టిణ్ణించి ఇలాగే పోతున్నాను. ఇంక నీ దారి నువ్వు నూసుకో; మన కియాలతో చరి.''

స్వామి కొంచెం దిగాలుపడి ''ఎక్కడికీ పోతావ్ ?'' అన్నాడు.

''ఈ సీకటిలోకి, నా పొట్టకి సంపాయించుకోటం నాకు తెలిసింది. ఈపాలి ఎక్కడికి పోయినా ఒకళ్ళ పమేయం లేకుండా ఒక్కత్తినీ స్వేచ్ఛగా బతగ్గల్ను.''

''మంగమ్మప్పా, తొందరపడకు; కూంతాలోచించుకో'' అని సలహా యిచ్చింది శేషమ్మ.

''ఇంక నా మణుసు తిరగదు, శాసమ్మా'' అంది మంగమ్మ నిశ్చలంగా.

''అది కాదే: నీ మణుసు నాకు తెలవదంటావా; ఇన్నాల్లనించీ నీతో వున్నందుకు ? కడుపు సింపుకొంటే కాల్లమీద పడద్దని కాదూ నా యేడుపంతాను ? ఈ గొడవొవళ్ళైనా యింటే కులం తప్పేసి మన పుట్టి ముంచుతారని నిన్ను కొట్టానుగాని, నీ మీద నాకు కోపమా ? ఇంకెప్పుడూ నిన్ను కొట్టను : ఇదుగో లెంపలేసుకుంటున్నాను. ఈ పాలింక యింటికి పోదాం, రామరి'' అని బ్రతిమాలేడు స్వామి.

''లాబంలేదు; ఇరిగిపోయిన మణుసు అతకదు'' అంటూ మంగమ్మ గిరుక్కుని తిరిగి గుడ్డివెన్నెలలో కలిసిపోయింది.

''అప్పా, అప్పా, వుండు'' అని వెనకాలే అరిచింది శేషమ్మ.

''ఇదంతా నా కరమం'' అని వాపోయాడు స్వామి.

''ఈకాపు యిాళ్ళ కాపరం మంటగలిపేడు; ఈడి మొగా న్నగ్గొయ్య!'' అని తిట్టుకుంటూ శేషమ్మ వూళ్లోకి పరిగెత్తింది.

''రేపటినించి పూర్తిగా సిల్లర డబ్బులు దగ్గర వుంచుకోడం మంచిది'' అని నిశ్చయించుకున్నాడు నరసయ్య కాపు చతికిలబడి.

శేషమ్మ గూడెంలో పెద్దల్నందర్నీ పోగుచేసి, రేపటినించి నరసయ్య

కాపు పనిలోకెవరూ పోకూడదని తీర్మానం తెచ్చింది. కాని అందులో వొక అనుభవజ్ఞుడు, "లాబంలేదు! మనమంతా కట్టుకట్టినా, కాపు మనిషికి రెండు డబ్బులెక్కువిత్తానన్నాడంటే మనలోనే పనిలోకిపోయే వోళ్ళుంటారు సిద్ధంగా, ఈ కరువురోజుల్లో," అని నీళ్లు కార్చాడు.

"అయితే, ఇంకింతేనా? ఎలాగమరి?" అని సమాధానంలేని రెండు ప్రశ్నలు వేసి నిట్టూర్చింది శేషమ్మ.

# బీచ్‌లో

ఆనందం కాలుస్తోన్నట్టు నటిస్తోన్న చుట్ట ఆరిపోయి చాలాసేపయింది. అతను వేసుకున్న మిలటరీ దుస్తులకు జేబులసంఖ్య ఎక్కువే అయినా ఒక్కదాంట్లోనూ అగ్గిపెట్టె అన్నది గోచరించక పోవడంవల్ల దాన్ని వూరికే అధరోష్ఠభూషణంగా అలా వుంచి బీచ్ యిసుకల్లో బిరబిరా నడుస్తున్నాడు. అసలు ఆనందం సైన్యంలో ఎందుకు చేరాడో అతనికే సరిగ్గా తెలయదు. అతని శీఘ్రగమనానికి ప్రత్యేకలక్ష్యం ఏమన్నావుందా అంటే అతనికిప్పుడేదీ లక్ష్యంలేదు. ఒకచోట ఒక అరవపడుచు కూర్చుని వేరుసెనగపప్పు అమ్ముతోంది. ఆమె నల్లని వొంటిమీద సముద్రుడు ఉప్పు పండిస్తున్నాడు; గాలి బాలుడు ఆమె వేణీ భంగం చెయ్యడానికి వెయ్యి విధాల తంటాలు పడుతున్నాడు; ఆమె ముడి అంత బిగువుగా వేసుకుంది. ఏజాతివో తెలియని కొన్నిపువ్వులు, ఆకులు మాత్రం ఆమె తలమీద తాండవిస్తున్నాయి. వాట్లనే నగరవాసులు కదంబం అని ముద్దుగా అంటారు. ఆనందం అక్కడాగి ఒకక్షణం ఆలోచించాడు. ఈమె యీ నగరంలో వుంటోన్నా యింత బలంగా ఎలా తయారవ గలిగింది? ఈమెకు హిస్టీరియా ఎందుకు రాదు? ఈమె కొంచెం మోటుగావున్నా నిత్యమందహాసిని ఎలాగవుతోంది? ఈమెకి అభ్యంగనం చేయించి, నింపైన తలకింత వాసననూనె రాయించి మంచి బట్టలు కట్టబెడితే యీమె కే నాగరక వనిత సాటికొస్తుంది? ఇత్యాది. నీకు పెళ్లి అయిందా అని ఆమె నడుగుదామనుకున్నాడు: చవటప్రశ్న! అవకపోతే తనకికూడా ఒక అవకాశం వుందని ఋజువుచేసుకోడానికి కాబోలు. తీరా ఆమె తనని పెళ్లాడడానికి సిద్ధపడితే తనేం చెయ్యాలి? తనకి నాగరిక స్త్రీలుకూడా అవసరం. అతను చటు

క్కన ఒక అణాపప్పు యిమ్మని ఆమె చేతిలో ఒకబేడ కాసుపెట్టి చరచర ముందుకు నడిచాడు. ఆమె అతనిచేష్టచూసి వొక అలవాటయిన నవ్వు నవ్వింది. ఆత నామె పళ్లని సరిగ్గా గమనించలేదు; లేకపోతే వాట్లని కూడా కొంచెం తోమించాలని అనుకునేమో!

కొంచెం దూరంలో జనం గుంపులోనించి వొక స్త్రీ వొయ్యారంగా, చురుకుగానడుస్తోండడం అతనికళ్లకి ఆనింది; అతనికి బుర్ర వెనుకభాగంలో ఏదో మెదిలింది. ఇందాకటినించీ తనికి తెలియకుండానే యీమెనే అతను వెంటాడి వెడుతూ వుండి వుండవచ్చు.

ఆమె చాలా పొడవుగానూ, బలంగానూవుంది. సముద్రపు గాలికి వుక్కిరిబిక్కిరై పక్కకి వొత్తిగిలుతోన్న చీర కుచ్చెళ్ళలోనించి తొంగి చూసే పటిష్ఠమైన తెల్లని పిక్కలనిబట్టి ఆమె తెల్లగావుంటుందని వూహించవచ్చు. ఒత్తుగా పొడవుగా వున్న ఆమె జడ పిరుదులు దిగి ఆమె నడకలో చూపుతోన్న సొంపుకనుగుణంగా పగపట్టిన పెద్ద నల్లత్రాచు పాములాగ, పెద్ద గడియారం తాలూకు పెండ్యులమ్ లాగ అటూ ఇటూ చక్కగా ఊగుతోంది. అందులో సవరాలున్నాయేమో అని మనం అనుమానించడం అనవసరం. మళ్లీ ఆ నల్లని తల నిండా ఆదేరకం కదంబం నట్టంగా, ఊపిరి సలపకుండా కుక్కబడడంవల్ల కాబోలు, అది యువతలకి వురికెయ్యాలని చేసేప్రయత్నం గోచరిస్తోంది. ఆమెకి తెలియకుండా కసికొద్దీ అతన్ని ఆహ్వానిస్తోంది. ఆనందం ఏదో దుర్విధిచేత యీడ్చబడుతోన్నట్టు ఆమెని సమీపించే ప్రయత్నంలో జనాన్ని దూసుకొని ఆ సాగరసైకతాలలో మరీ చరచరా నడుస్తున్నాడు. అతను చూసినంత మట్టుకు ఆంధ్రాంగనలలో అంత అంగసౌష్ఠవం వున్నవాళ్లు లేకపోవడం వల్ల ఆమె వొకానొక మళయాళ భగవతి అయివుంటుందని వూహించాడు. అతని మెదడు అడుగుభాగంలో ఇంతదాకా కలిసిపోయి గడ్డకట్టిన వివిధజాతుల భావాలు ఒక్కసారిగా విడివడి మరఫిరంగి గుళ్లలాగ కోలాహలం చేస్తున్నాయి.

ఆవిడ మొహం ఎలావుంటుందో? తను మనస్సులో చిత్రంచుకున్నట్టు వుంటే ఎంతబాగుండును:—పరస్త్రీ మొహం చూడకూడదుట. మరి గుమ్మం దాటితే ఇంకెవరి మొహం చూడడం? పోనీ అంత చూడరాని మొహాలయితే తురకల ఆడవాళ్లలాగ ఒంటినిండా బురఖాలు కప్పుకుని ఇంట్లో

కూంచోరేం, వీళ్లు? రోజూ ఇంట్లో ఆవొక్క మొహాన్నీ ఎన్నాళ్లని చూడడం? మరి యీ మొహాలు చూడకూడనివే అయితే ఏ బజారులో చూసినా విరివిగా ఖర్చయ్యే యీసబ్బులూ, ఫేస్ పౌడరు డబ్బాలూ, స్నోలూ, పెదవి రంగుకణికలూ ఎవరు కొంటున్నారు? ఎవరికోసం? ఎందుకని? ఈ రంగురంగుల చీరల సింగారా లెందుకోసం? మొహాలమాట అలావుంచి మరి ఆజుట్టునిండా వీళ్లు అన్ని పూవులూ, ప్రతీ తురుముకోవడం తాము చూసుకుని సంతోషిద్దామనేనా? వీళ్లుమాత్రం మనకేసి చూడకుండా కళ్లుమూసుకుని మసులుతున్నారా? కనుక తను వాళ్లకేసి చూడడంలో ప్రమాదం ఏమన్నా వుండేమోకాని తప్పమట్టుకేమీ లేదు. తన భార్య తన మనస్సులో భావాలన్నీ గ్రహించుకుని తమాషాగా శృంగార చేష్టలూ అవీ చేసి తనని వలపించి వశంచేసుకోవాలని అతని ఆశ. కాని, ఆవిడని తగలెయ్యా, వాళ్ల ఆవిడ, ఎప్పుడూ అటువంటి పాపాని కొడిగట్టలేదు. ఆవిడ అసలు ఉద్రేకం, ఉద్దీపనం ఇలాంటివి అంటే ఏమిటో ఎరగని స్తబ్ధు. రూపానికిమట్టుకేమీ లోటులేదు. అంతరూపంతోటీ ఆవిడ పెద్ద హిమాలయ పర్వతం అంత గాఢశీతలం. ఆవిడని చూస్తే తనకి చలీకుదుపూ వేసుకొస్తాయి; దగ్గరికెడితే అన్నీసంకుచించి పేరుకుపోతాయి. ఆవిడ మెదడు పేడతోటి చేయుబడిందని అతను నిశ్చయం చేసుకొన్నాడు. కాని తనకి కాస్త ఉద్రేకం కలిగించుకుని మోహించడం తప్పదుగా. ఎన్నాళ్లని తనకి తనే వేడెక్కించుకుని తంటాలుపడడం? మరి ఉభయ పక్షాలూ ఉద్దీపించి, రంజిల్లాలనే సంసారం సూత్రం అమలులో వుండడం ఎన్నడైనా జరిగే పనేనా? దీనికి జవాబుదారీ ఆవిడతండ్రీ సవతితల్లీనా? సవతి అత్తగారంటే ఆతనికి పట్టలేని అసహ్యం—మామగారికి మొదటే బుద్ధిలేదు. ఆయన తన ధర్మమేదో అది నిర్వర్తిస్తున్నాడుట. అంటే పిల్లని యీడొచ్చీదాకా ఎలాగోలాగ పెంచి ఒక మగపుర్రాడికి కట్టబెట్టి చేతులు కడుక్కోడం అన్నమాట. అతను కొత్తగా అత్తవారింటికి, లాంఛనానికి వాళ్లు పిలిచినప్పుడు, కాపరానికి వెళ్లేరోజుల్లో ఆ అత్తగారు రాత్రి భోజనం చేసి మూతి కడుక్కుంటూనే కేటాయింపుగావున్న గదిలో మామగారి దగ్గరచేరి తలుపేసుకునేది. ఇంక తన భార్య ఇంటిదుపని చేసుకుని రాత్రి ఏ రెండు ఝాములకో యివతలపడితే నూతనదంపతులైన తనూఆవిడా,

దోమలూ నల్లులూలాంటి ఆ సవతి అత్తగారి తాలూకు సంతానం మధ్య మండువాలో రాత్రి తెల్లవార్లూ అభిమానంతో, భయంతో అఘోరించాలి. పోనీ, వాళ్లకి కొత్తగా పెళ్లిచేశాం, వీళ్లు కులాసాగా, స్వేచ్ఛగా వుండటానికి ముచ్చటగా వొక గది ఏర్పాటుచేద్దామనే జ్ఞానం ఆ పురాణ పుణ్య దంపతుల కెన్నడూ కలుగనైనా లేదు. ఆ పరిస్థితుల్లోనే ఆనందానికి ఆడవాళ్లంటే వొక విధమైన భయం, హేయభావమూ ఏర్పడ్డాయి. అప్పుడప్పుడతడు స్త్రీ, పురుషుడి పాలిట వినాశదేవత అని తన విశ్వాసాన్ని ప్రకటిస్తోంటాడు. అయినా స్త్రీలంటే—

మెదడు తన తొందరపనిలో నిమగ్నమైవున్నా పాపం జ్ఞానేంద్రియాలు వాటి ఆజ్ఞలనవి భక్తిశ్రద్ధలతో పరిపాలిస్తాయి. ఆఅమ్మాయి మళ్లీ జనంలో కరిగిపోయి మాయమయిందని అతనికళ్లు ఒక్కకేక వేసి చెప్పేయి అతనికాళ్ళు పైకిలేచాయి; చప్పున ఆగి మడమలు పైకిలేచాయి, మెడ కొంచెంపైకి ఎదిగింది. బుర్ర అర్ధచంద్రాకారంగా అటూ ఇటూ తిరుగుతోంటే కళ్లు రెండూ, ఆకాశపులోతులో లెక్కప్రకారం వుండవలసి కనపడని నక్షత్రాల్ని దుర్భిణులలాగ అతి చురుకుగా జాగ్రత్తగా, వెతుకుతున్నాయి. ఇంతలో వెలికే దూరమే ఆకారము కారుమబ్బుల వెనకనించి వెలువడిన చంద్రమండలంలాగ విడిగా, స్పష్టంగా గోచరించింది: అమ్మయ్యా! అతని కాళ్లు మళ్లీ ఆ విశాలమైన ఇసుకతిప్పలలో పరుగుధోరణిలో పడుతూ లేస్తున్నాయి. ఈ అనుకోని వుపద్రవంలోంచి బైటపడగానే అతని మెదడు మళ్లీ తన మామూలు ఆలోచనల్లో పడింది.

ఆనందం ఎప్పుడూ స్త్రీ పురుష సంబంధ రహస్యాలని గురించే దీక్షగా ఆలోచిస్తోంటాడు. స్త్రీకీ పురుషుడికీ మధ్యవున్నదేమిటి? జీవశాస్త్రం ప్రకారం చూస్తే కామవాంఛ; ప్రయోజనం మానవ జీవరాసి విస్తరణం. పురుషుడూ స్త్రీని అన్యోన్య సంపర్కం అవసరంలేకుండా జీవితాన్ని గడిపితే అది సంపూర్ణత్వాన్ని పొందదన్నమాట. కనుక ఒహరి నొకరు జ్ఞానేంద్రియాల ద్వారా ఆకర్షించుకుని ప్రకృతియొక్క ప్రయోజనాన్ని సాధిస్తారు. ఈ ఆకర్షణ శక్తినిగురించి న్యూటన్ గారిట్లా సెలవిచ్చారు- ఈ పరమాణు సంకలితమైన విశ్వసృష్టిలో ప్రతి అణువు ప్రతి ఇతర అణువునీ సమానమైన శక్తితో తనవైపు ఆకర్షిస్తుంది అని; దీనికి చేతనా చేతన విచక్షణతో

నిమిత్తంలేదు. ఈ లెక్కని అవయవ పరిమాణాల ప్రమాణాన్ని బట్టి నాతో పోల్చుకుంటే ఆవెళ్లే అమ్మాయి, నే నామెనుకంటె నన్ను బలతరంగా ఆకర్షిస్తూవుండాలి. లేకపోతే ఆమె వెనకాలే నేను ఎందుకు పోతున్నాను? అసలు నేనామెను ఆకర్షించనేలేదేమో? అలాగయితే ఆమె ఒకసారైనా వెనక్కి తిరిగి నాకేసి చూసివుండవలసింది.; నేనంటూ ఒకణ్ణి ఈ ప్రపంచకంలో వున్నాననే సంగతే ఆమెకు తెలిసివుండకపోవచ్చును. ఆమాటకొస్తే నన్నొకకోతి ఆకర్షించవచ్చు; ఒకకుక్క ఆకర్షించవచ్చు; ఒకరాయి ఆకర్షించవచ్చు. ఇలా ఆలోచిస్తే అన్నింటికంటె పెద్దరాయి అయిన హిమాలయమో నామనగాధి రాజుకి మనం అంతా, సూదంటురాయికి అంటుకునివున్న ఇనపబీడులాగ, అంటిపెట్టుకు పోయి వుందుము. అందులో అణువులు ఏవొక్క వస్తువులో కంటే అనేక రెట్లు ఎక్కువ వున్నాయి కనుక. అబ్బే, యీ ఆకర్షణ సిద్ధాంతానికి అర్థంలేదు. అందుకనే ఈన్‌స్టీన్ వచ్చి దీన్నితోసిరాజని, 'యద్భావం తద్భవతి' అన్నట్టు ఇదంతా మనం అనుకోవడంలో వుంటుందని ఒక అవినాభావ సిద్ధాంతాన్ని కనిపెట్టాడు. కాని కామశాస్త్ర విషయమైన ఆకర్షణ నియమాలకి ముఖ్యం, ఆకర్షక ఆకర్షణీయ ద్రవ్యాలు ఒకే జీవరాశికి చెందినవై వుండాలి.

అసలిలాంటి ఆకర్షణ అంటూవుంటే నన్నింకొక మొగవాడెందుకు ఆకర్షించకూడదు? ఈవిడే ఎందుకు నన్నిలా యీడ్చుకుపోవాలి? అందుకని ఈ ఆకర్షణ ప్రభావ పీడితులు వ్యతిరేక లింగధారులై వుండవలసిన అవసరం స్పష్టంగా కనిపిస్తోంది. అయితే ప్రతిపురుషుడూ ప్రతి స్త్రీనీ ఆకర్షించడానికి వీలుంది. ఈ సూత్రాన్ని కొన్నాళ్లు అమలులో పెట్టి చూశాను; కొందరు మిత్రుల అనుభవాలతో పోల్చిచూశాను. ఇది చాలా అసందర్భం— నామిత్రుడొకాయన, ఆయన పేరు చెప్పను, ఎదరఇంటిలో వున్న వొక చదువుకుంటోన్న ఆవిడమీద తనచూపుప్రయోగించాడు; చూపూ చూపూ కలిస్తే ప్రేమ ఎందుకు పుట్టదు, అని. ఆవిడ మేడమీద కిటికీలో నుంచుని తలదువ్వుకోడం, అక్కడే కూర్చుని చదువుకోవడం మామూలు. ఒకటి రెండుసార్లు కిటికీ తెరిచేటప్పటికల్లా ఇతను ఎదురుగా అనేక పోజులలో సాక్షాత్కరించేవాడు. ఆవిడ రెండురోజులు చూసి ఇతను కనిపించే

ప్పటికల్లా కిటికీ తలుపు కోపంగా ఠపీమని వేసేసేది. మావాడు పట్టుదల విడిచిపెట్టకపోవడం మూలాని ఒకవారం రోజులకి, వాళ్లు మంచివాళ్లు కనక చల్లగా ఆఇల్లు మార్చేసుకున్నారు. ఆయన ఆమెమీద ప్రేమ పద్యాలు కూడా రాసి వినమని నన్ను వేధించేవాడు, 'ఆయనే మరోకపిల్లను ఆకర్షించే ప్రయత్నంలో రోడ్డుమీద రెండురోజులు వెంటాడిస్తే ఆవిడ యితనికేసి గుడ్లురిమి వుమ్మేసి వెళ్లిపోయిందట. ఇప్పుడు ఆపిల్లంటే తనకి అసహ్యం పుట్టిందంటాడు నా మిత్రుడు. ఈ ప్రకారం అతను చాలామంది అమ్మాయిల చిరునామాలు మాత్రం తెలుసుకోగలిగాడు. పడుచు పిల్లల మాట ఇలా వుంచి అతను పెద్దవాళ్లని అసలే ఆకర్షించలేదు. సంఘశాస్త్రంలో బలవంతులైన వాళ్లు బలహీనులని తన్ని తరిమేసి స్త్రీలని వశంచేసుకునే ఆచారం వుండేదని వుంది. ఇది ఇప్పటిమాట కాదు. అలాగయితే మల్ల యుద్ధ ప్రవీణుడైన గామాగారిని మానినీ నవమన్మథుడని శ్లాఘించవలసి వుండును; నావంటి నీరసస్తులకి కామతృప్తి అనే అనుభవమే లోటువచ్చి వుండును. కనుక అందరూ అందరు వ్యక్తులనీ ఆకర్షించలేరు; ఒక వ్యక్తి ఒకేవ్యక్తిని ఆకర్షించి అంతటితో వూరుకోవడమూ దుర్ఘటమే. పోనీ అందాన్ని చూసి వాంఛిస్తున్నామా అంటే సౌందర్యం అనేది చర్మసఘ్నమంటారు తెలిసిన వాళ్లు. చర్మపటం వొలిస్తే సరుకంతా వొకటేటీరు. అయితే నా చూపులు ఎంతమందిమీద ప్రాకలేదు? ఈ అమ్మాయే నన్నెందుకు ఆకర్షించాలి, కొంతవరకు నేను సౌందర్యం అనుకునేది యీమెలో వుంది. ఈమెని ఎన్నికచేశాను. ఈ ఎన్నిక పరమేష్టినుండి నాతరందాకా రక్తంలో అనూచానంగా అందజేయబడిన అసూయలు, అసహ్యాలూ, ఇష్టాలూ కలుగజేసే అభిరుచులమీద ఆధారపడి వుంటుంది. కనుక ప్రాయంవచ్చినవ్యక్తి మరోకవ్యక్తిని ఎన్నుకొని సమీపించి, 'ఇదిగో, నా అభిరుచులు ఇవి; నీ అభిరుచు లెట్టివి? నాకు నీతో సంసారం చెయ్యాలనే ఇచ్ఛకలిగింది. ఏమంటావ్?' అని ముఖాముఖి అడిగి తేల్చుకుంటే ఎంతైనా సుఖం వుంటుంది. మన సంఘంలో అలా ప్రాయం వచ్చిన ఆడవాళ్లకీ మొగవాళ్లకీ స్వేచ్ఛగా సంప్రతించుకునే అవకాశాలుంటే ఎంతబాగుండును? మనకి ధైర్యమూ లేదు-ఉంటే తను సైన్యంలో ఎందుకు చేరతాడు?—

ఆ అమ్మాయి తను నడిచేదారికి నలభై అయిదు డిగ్రీలు ప్రక్కగా మళ్లీ నడుస్తోంది. అప్పుడే మునిగిపోయినట్టు చీకటి ముంచుకొస్తోంది. ఆఅమ్మాయి తాలూకు ఒక నేత్రాంబుజము, చక్కని ముక్కుతో మైత్రి చేస్తూన్న ఒక కపోలము, పీన వక్షంపు వంపు మొదలైన ఒక పార్శ్వము నీలమైన సముద్రపు తెరపైన కొంచెంలీలగా కనిపిస్తోంది. ఆనందానికి అనుమానం వేసింది: ఆ మృగాక్షికి అవతలవైపునకూడా ఇంతనిండైన కన్ను వుంటుందా అని అతనికి చెడ్డ అనుమానం: వుత్తరం రాసి కవరులోపెట్టి అడ్రసురాసి మళ్లీ పోస్టులో వేసేముందు ఆ కవరు ఒకసారి విప్పి మళ్లీ అతికించి మరీ అందులో వేస్తూంటాడు: కవరులో వుత్తరం పెట్టానా ఖాళీదే పడేస్తున్నానా అని. తను అనుకున్నట్టు ఒక్కటీ జరగదు; తను వొక్కడే అనుకోవడంచేత నేమో అనుకుందామంటే, అందరూ కలిసి యుగయుగాల నించి అనుకునేవి మాత్రం సరిగ్గా జరిగేదుస్తున్నాయి గనకనా? మన సంఘం నిషేధాలతోటి కుళ్లి కుమారిల్లుతోంది. స్త్రీ పురుషులకు సమానాధికారాలు లేవు. పెద్దలనబడే వాళ్ల అధికార దౌష్ట్యాలు సన్నగిలే సూచన ఇంకా అయినా కనబడటంలేదు. స్త్రీ పురుషులు ఒకళ్ల మనస్సులొకళ్లు అవసరమైతే విప్పిచెప్పుకునే అవకాశాలు అంతకంటే లేవు. వీళ్లు అంతా వొకళ్లకి లేనట్టు తోపించే గాలి చొరని గదులలో మసలాలని సంఘశాసనం. వీళ్లు విచ్చలవిడిగా కలిసిపోతారేమో అనే భయంతోనే కాబోలు అలాంటి ఉపద్రవం కలగకుండా, దేవుడు గుళ్లల్లోకూడా ద్వారాన్ని రెండు భాగాలుగా విభజించే వెదురుకర్రదడి కడతారు; సినీమాలలోను, రైళ్లలోనూ, సభలలోనూ స్త్రీలకి ప్రత్యేకస్థలం. ఈ ఏర్పాట్లన్నీ స్త్రీలు చేయించుకుంటున్నారా, పురుషులు చేస్తున్నారా? ఎప్పుడు విన్నా వాడు ఆమె వెనకాల తిరుగుతున్నాడనేకాని ఆమె వాడికోసం పడిచస్తోంది అని ఎందుచేత వినమో? కాని చరిత్రనుబట్టి ఆంగ్లకవి బైరన్, బ్రిటీషు విదేశాంగ మంత్రి ఈడెన్ మొదలైనవాళ్లని ఆడంగులు తండోపతండాలుగా వేధించినట్లు కనబడుతుంది. మనలో నాటకయుగంలో స్త్రీవేషం బాగా నటించగల పురుషనటులకి పుణ్యాంగనలు ప్రణయలేఖలు రాసేవారని వింటాం. అయినా స్త్రీలకి కామవాంఛని నిరోధించుకోగలశక్తి ఎక్కువగా వుంటుందిట; మొగాళ్లే వెర్రాళ్ళు.

ఆనందం కాళ్లులాగుతోన్నా ఆ ఇసుకపర్రలో, జనసందోహాన్ని చీల్చు కుని చకచక నడుస్తున్నాడు. ఆనందం పదహారణాలు బ్రాహ్మణ యువకుడు. అయినా బ్రాహ్మణ విధుల నేవీ నిర్వర్తించక పోవడంవల్ల అతనికేమీ నష్టం గోచరించలేదు. ఇంకిప్పుడతను సంధ్యావందన మంత్రంలో స్వర్ణయోగ తంత్రం వుందని ఎవరైనా చెప్పినా దానిజోలి తనకక్కరలేదంటాడు. మనం బలిష్ఠులుగా, మేధావంతులుగా వుండి బాగుపడాలంటే ఇతోధికంగా మాంసభక్షణం అవసరమని నమ్ముతాడు. కాని అతను ప్రస్తుతం ఇరానీ రెస్టారెంటులో కోడిగ్రుడ్డు ఆట్లు తినడందాకా మాత్రమే పెరగగలిగాడు. అతని అంతస్సు చాలా తక్కువమంది గ్రహింపగలరు. అతనిలో, ఆధునిక శాస్త్రిలతో పరిచయం చేసుకోవడంలో ఉన్న ఉత్సాహం పరాయివాళ్లను పరిచయం చేసుకోవడంలో కనుపించదు. ఎక్కువ మందిని ఎరిగివుండడం చేత తన ఆత్మప్రశాంతికి భంగకరం అని అతని వుద్దేశం. అతని భావాలు ఒక చక్కగా నలిగిన బాటలో స్వారీ చేస్తుంటాయి. ఆనందం చాలా మంచివాడు. అంటే బ్రతుకు తెరువెరగని వాడన్నమాట. అతను మిత భాషి: అతని గంభీర హృదయంలో అగ్గిపెట్టెలు మొదలు అగ్నిపర్వతాల దాకా ఏవో తీవ్రంగా దహించే దేవుళ్లాట లిమిడివున్నాయన్నమాట. ఆనందం ఆంతర్యంలో మంచి రశికుడు. అతను తీరని కోరిక లన్నింటినీ మానసికంగా ఉత్క్రిమణీకరణం చేసి తృప్తిపడతాడు. అతను పగటి కలలు కనడంలో రగడు తేలాడు. తరచు ఇంగ్లీషు సినీమాలకి వెళ్లి చూస్తూంటాడు. అక్కడ వెండితెరమీద తల దిమ్మెక్కించే విజాతీయ సంగీతంలో లీనమై శరీరసౌష్ఠవాన్ని పోషించుకోవడమే లలితకళగా ఆరాధించే పమిటలులేని నిండైన స్త్రీలూ, వాళ్లని ఆరాధించే పురుషులూ, స్వామ్యత్వభేదం పాటించ నవసరంలేకుండా స్వర్గసీమలోలాగ నృత్య లాస్యాలు, కామోద్దీపక శృంగారచేష్టలూ చేస్తూంటే స్వేచ్ఛాపూరితమైన ఆ శరీరాల ఒరపిడిచూసి తన్మయత్వం పొందిపోయి తన మనోదుఃఖాన్ని వృద్ధిచేసుకుంటాడు. మన దేశానికి స్వాతంత్ర్యం కావాలని ఊరికే ఇదవుతారు. అసలు మనలో ఆ స్వాతంత్ర్యదాహంలేందే. ముందు మానవ దౌష్ట్యానికి స్వస్తిచెప్పాలి అని తోచదు వీళ్లకి. ఆనందంలో దంపతిభావం క్రమంగా సన్నగిల్లుతోందంటే ఆశ్చర్యం పడనక్కరలేదు. వేశ్యలనే ఒక

ఘనసంస్థ మన సంఘంలో వుండడమొక సుగుణమే. ఇటువంటి మొగవాళ్ల సంస్థలుకూడా కొంత అవసరమేమో ? ఇంతకీ ఆడవాళ్లు అలాంటివి వుండాలని గోలపెట్టినప్పుడు చూసుకోవచ్చు. ఆనందం ఒకటి రెండుసార్లు వేశ్యల యిళ్లకి వెళ్లాడు. కాని ఆ మర్నాడు ఇతను వట్టి దద్దమ్మ అని వాళ్లు అభిప్రాయపడినట్టు ఇతనికి తెలిసింది. అదొక పెద్ద అవమానంలోదికాదు.

ఆనందం కళ్లు హఠాత్తుగా భయ విహ్వలంగా భ్రమించిపోయాయి. అతని కాళ్లు చటుక్కున ఆగిపోయాయి. ఆదూరాన వెళ్లే అమ్మాయి మళ్లీ జనంలో, కనుచీకటిలో లీనమైపోయింది. పరుగెట్టుకెళ్లి వెతికితే? అందరూ తనకేసిచూస్తారు. చేస్తారేం? పరుగెట్టీ పరుగెట్టనట్టు పరిగెట్టాడు. ఆగుంపులో కాగడాలలాంటి కళ్లతో చెడ వెతికాడు. ఆ అమ్మాయి కనబడలేదు. సముద్రం అంత హోరూ అతని బుర్ర లో పెట్టింది. ఇంతలో ఎలా మాయమైపోయింది? చిత్రంగావుంది. ఆనందానికి ఆ సాయంకాలం అంతా వ్యర్థంచేసుకున్నట్టునిగులేసింది. ఏదైనా ఇంగ్లీషు సినీమాకైన వెళ్లాను కాదని తనని తనుతిట్టుకున్నాడు. కొంచెంసేపటికి తెప్పిరిలి స్త్రీలింగం పురుషలింగానికి పతనహేతువని ఖచ్చితంగా సిద్ధాంతీకరిస్తూ ఆ విశాల సైకతాల్లో చతికిలపడ్డాడు.

---

# స్త్రీల సమస్యలు

రచయిత :- తిరుపతిరాయుడు

నేటి ప్రతిమహిళను అనేక సమస్యలు కలవరపెడుతున్నాయి. ఆర్థిక సమస్యలు, సాంఘికసమస్యలు, రాజకీయసమస్యలు యీఅన్నిసమస్యల తుఫానులోనూచిక్కి నేటి భారతస్త్రీ కలవరపడుతూంది. ఈసమస్య లన్నింటినీ పరిష్కరించే ఒక చక్కని శాస్త్రీయ మీమాంస యీగ్రంథం.

# ప్రపంచనాటికలు

అనువాదకులు :- పి. వి. సుబ్బారావు

కె. రాధాకృష్ణమూర్తి

విశ్వవిఖ్యాతిగడించిన నాటికకర్తల మాతృకలకు చక్కనిస్వేచ్ఛానువాదం

# ప్రపంచకథలు

(రెండవ భాగం)

అనువాదం :- కె. రాధాకృష్ణమూర్తి

పి. వి. సుబ్బారావు

మొదటిభాగం మీరు చూసేవుంటారు. The thing speaks for itself అన్నట్లుగా ప్రత్యేకంగా యీపుస్తకాన్నిగురించి చెప్పవలసింది ఏమీలేదు.

# నేతాజీ జిన్నా

మహమ్మదీయసంఘానికి జీవంపోసి వున్నతస్థితికి తీసుకురావాలనీ, ప్రత్యేకస్థానం భారతదేశంలో మహమ్మదీయులకు ఏర్పరచాలనీ కృషిచేస్తూ వున్న జిన్నాయొక్క జీవితచరిత్ర చాలా చక్కగా చిత్రింపబడింది యీ చిన్నిపుస్తకంలో.

